# బానిసా కాదు
# దేవతా కాదు

రచన

## మల్లాది సుబ్బమ్మ

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు
9, ఎం.ఐ.జి.హెచ్. కాలనీ,
మెహిదీపట్నం—హైదరాబాద్
పిన్ : 500 028

# బానిసా కాదు, దేవతా కాదు

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు ప్రచురణ నెం-8

Acc. No. 1412

ప్రతులు : వెయ్యి
ఆగస్టు 1988
రచన : మల్లాది సుబ్బమ్మ


ప్రచురణ కర్తలు : మల్లాది సుబ్బమ్మ ట్రస్టు
9, ఎం ఐ.జి హెచ్, మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028.

సోల్ డిస్ట్రిబ్యూటర్సు : **వికాసం**
9, ఎం.ఐ జి. హెచ్, మెహిదీపట్నం
ఫోను : 35129

వెల : రు॥ 10-00

ముద్రణ : డాన్ ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాద్-500 004

# విషయ సూచిక


| | | పుట |
|---|---|---|
| 1. | వివాహ వ్యవస్థ : పరిణామం | 1 |
| 2. | వివాహానంతరం స్త్రీ జీవిత విధానం | 8 |
| 3. | దగా పడిన భార్యలు | 13 |
| 4. | విద్య ఎందుకు? ఉరి పోసుకునేటందుకా? | 16 |
| 5. | అమ్మాయిల హత్యలు : ఆత్మహత్యలు | 20 |
| 6. | అత్తల వ్యథ కోడళ్ళ బాధ | 24 |
| 7. | ఆడది వంటకు ఇంటి పనికే పుట్టిందా? | 28 |
| 8. | ఇంటి చాకిరీకి ఖరీదు కట్టే షరాబులెవ్వరు? | 31 |
| 9. | విధవరాలి పరిస్థితి మారదా? | 36 |
| 10. | ఇది విన్నారా? మహిళలకొక ఆశాజ్యోతి | 40 |
| 11. | ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి? | 44 |
| 12. | సహజీవనంలో ఆధునిక పోకడలు | 48 |
| 13. | వివాహ పద్ధతుల్లో రావలసిన మార్పులు | 52 |
| 14. | బాధ్యతాయుత వైవాహిక జీవితం | 56 |
| 15. | ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే? | 57 |

# ఇది నా మనవి

'ఆమె పతితా కాదు; పతివ్రతా కాదు. బానిసా కాదు; దేవతా కాదు.' అనేవి ఈనాటి 'స్లోగన్లు' కావాలి.

ఇంత వరకు ఈ దేశంలో స్త్రీలను దేవతలుగానో, బానిసలుగానో చూడటం తప్ప మనిష్యులుగా చూడలేక పోతున్నారు. వారిని గృహదేవతలుగా పూజనీయలుగా చూస్తున్నా మంటూ బానిసలుగా చూడటం సర్వ సాధారణమయింది. సమాజంలో సగ భాగమైన స్త్రీలు బానిసలుగా ఉన్నారా? ఉంటే వారు ఎవరికి బానిసలు? కుటుంబాలకా లేక భర్తలకా? లేక సమాజానికా? ఈ ప్రశ్నలు ఎదురవుతుంటే 'అందరికీ' అనే సమాధానం వస్తున్నది. స్త్రీలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్న శక్తి స్వరూపులని, కుటుంబ వ్యవస్థకు ప్రాతిపదికలని, వారిని బానిసలుగా చిత్రించడం హాస్యాస్పదం అని వాదించే వారు నాడే కాదు నేడూ ఉన్నారు.

పశ్చిమ దేశాల్లో కూడ స్త్రీ పురుష సమానత్వం లేదు. వారికి సైతం రాజకీయ ఆర్థిక అధికారాలు, అవకాశాలు లేవు. ఆ దేశాల్లో స్త్రీ విమోచనోద్యమ లక్ష్యాలు కేవలం స్త్రీల భౌతిక జీవన ప్రమాణ స్థాయిని పెంచేవిగానే ఉన్నాయి. ప్రజాస్వామిక విలువలు వారిలో కూడా జీర్ణించి పోలేదు.

పారిశ్రామికీకరణ, సాంకేతికాభివృద్ధి ఫలితంగా వచ్చిన మార్పుల వల్ల స్త్రీల దైనందిన జీవితావసరాలు అతివేగంగా తీరటాన్ని ఆధునికతగా గుర్తించడం పొరపాటు. నాగరికతలో వచ్చిన మార్పును చూచి అది సంస్కృతి అని భ్రమించడం సరి కాదు. సాంస్కృతికంగా మన జీవిత విధానంలో, నడవడిలో మార్పు లేదు. అందువల్లే స్త్రీని రెండవ తరగతి వ్యక్తిగా, నాశి రకంగా పరిగణిస్తున్నారు. ఇదీ జరుగుతున్న చరిత్ర. ముందుగా వ్యాధిని గుర్తిస్తే దాని నిర్మూలన చాలా తేలిక. ఎన్ని సమస్యలున్నాయో అన్ని రకాల సంస్కరణలూ ఉన్నాయి. అది మన చేతిలో పని. అది కష్టసాధ్యమైనా దుస్సాధ్యం మాత్రం కాదు. ఈ నిత్య సత్యాన్ని గుర్తిస్తే స్త్రీ బానిసా కాదు, దేవతా కాదు అని, ఆమె సర్వ శక్తి సంపన్నురాలయిన వ్యక్తిత్వం కల మానవ వ్యక్తి అని గుర్తించటం అతి తేలిక అవుతుంది.

ఈ సంకలనంలోని వ్యాసాలన్ని ఇంతకు పూర్వమే అనేక దిన, వార, మాస, పక్ష పత్రికల్లో ప్రచురితమయినవే; రేడియోలో, టి.వి లో, సెమినార్లలో ప్రకటిత మయినవే. ఇందులోని వ్యాసాలకు శాశ్వత స్వభావం ఉందనే భావంతో వాటిని పుస్తక రూపంలో వెలువరిస్తున్నాను. ఆయా పత్రికాధిపతులకు, డైరెక్టర్లకు నా ధన్యవాదాలు. ఈ పుస్తక ప్రచురణలో సాయపడిన నా సహచరుడు జీవిత భాగస్వామి శ్రీ ఎం. వి. రామమూర్తికి నా ప్రత్యేక కృతజ్ఞత. ముఖచిత్రం వ్రాసి యిచ్చిన జి. శివరాం గారి సహాయాన్ని నేను మరవజాలను.

ఈ గ్రంథం మహిళోద్యమానికి ఉపకరించాలని నా ఆశయం.

**రచయిత**

# వివాహ వ్యవస్థ : పరిణామం

మానవ సమాజం 50 వేల సంవత్సరాల నుండి మనుగడ సాగిస్తున్నట్లు చరిత్రకారులు నిర్ధారణ చేసారు. కాగా నాగరికతల చరిత్ర ఆరువేల ఏళ్ళనుండి మనకు బాగా తెలుస్తున్నది. మానవునికి భౌతిక, శారీరక, మానసిక, "ఆధ్యాత్మిక" అవసరాలు వున్నాయి. వీటిని తీర్చుకునే ప్రయత్నంలో మానవ సమాజం అనేక వ్యవస్థలను నిర్మించు కున్నది. సెక్స్ అనుభవంకై ఆరాటం, తోడుకోసం ఆశించడం మనిషి యొక్క సహజ ధర్మాలు. మనుగడ కోసం జరిగే పోరాటంలో ప్రకృతితో, జంతు జాలంతో ఇతర జన సందోహంతో మనిషి పోరాడ వలసి వుంటుంది. ఆ సందర్భంగా జన స్తోమత అవసరం అయి సంతానం ద్వారా వంశాభి వృద్ధిని, తెగల పెంపుదలను ఆశించడం జరిగింది. దాంతో ఒక దశలో సంతాన ప్రాప్తికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం సంభవించింది. తను సంపాదించిన ఆస్తి, తను సంతరించిన ధనం తన పిల్లలకు సంక్రమింప జేయాలని కలిగింది. దాంతో ఈ సంతానం ఈ జంటదే అని నిర్ధారించటానికి స్త్రీ పురుషులు ఒక శాశ్వత బంధాన్ని నిర్మించు కోవలసిన ఏర్పడింది. అదే వివాహ వ్యవస్థ. మానవ జీవితంలో వివాహం చాలా ఉత్కృష్టమైనది, ముఖ్యమైనది; శాస్వతమైనదీ కూడాను. అంతేకాదు దానికి జీవితాంతం సుఖశాంతులను, అండదండలను, ఆత్మీయతను ఒనగూర్చే శక్తి వుంది. అలాంటి బంధాన్ని స్వర్గతుల్యం చేసుకోవాలన్నా, నరకతుల్యం చేసుకోవాలన్నా అది ఆ దంపతుల ఔదార్యం మీద ఆధారపడి వుంటుంది. అలాంటి వివాహ వ్యవస్థ పూర్వాపరాలను పరిశీలించడం మన ముఖ్య కర్తవ్యం.

భారతదేశంలో వివాహ వ్యవస్థను మతసమాజాలు, మతధర్మ శాసనాలు నియంత్రణం చేస్తున్నాయి హిందువుల దృష్టిలో వివాహం సంస్కారమయితే ముస్లిం సమాజంలో అది ఒప్పందం మీద ఆధార పడుతుంది. క్రైస్తవ వివాహం దైవ నిర్దేశితమంటారు. ఇలా వీటి స్వరూప స్వభావాల తేడాలను బట్టి ఆయా వివాహాల రూపాలు భేదిస్తూ వుంటాయి.

సమాజం అనేక దశల్లో పరిణామం చెందింది. ఆదిమ కమ్యూనిజం తర్వాత బానిసత్వ విధానం, భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారి విధానం, సోషలిజం, కమ్యూనిజం ఇలాఎన్నో దశలలో పయనిస్తున్నది. అంతేకాక ఈ వివిధ దశల్లో అనేక శాఖలు, ధాయలు, తరహాలు ప్రొడస్ఫూర్తినయి సమాజం యొక్క ఆర్థిక నిర్మాణం ధాన్ని

తాత్విక, సామాజిక, సాంస్కృతిక రాజకీయ, మత, కళాత్మక భావాలను ఎంతగానో ప్రభావితం చేస్తున్నది. అలాగే ఇవన్నీ సమాజం యొక్క ఆర్థిక నిర్మాణ విధానంపై ప్రభావాన్ని చూపుతున్నాయి. సమాజంలో అంతర్భాగమైన వివాహ వ్యవస్థ వీటి అన్నిటి ఆటుపోట్లకు గురి అవ్వడంలో ఆశ్చర్యం లేదు ఒకనాడు కేవలం సెక్స్‌కోసం వివాహం అవసరమయితే మరియొక దశలో స్త్రీ పురుషుల మధ్య పని విభజన సందర్భంగా పెళ్ళి పద్ధతి కావాల్సి వచ్చింది. ఒక దశలో సంతానాభివృద్ధి ధ్యేయమయితే అందుకు వివాహ విధానం వుపకరించింది. పూర్వీకుల పూజకు, పితృదేవతల ఆరాధనకు, పితృరుణం తీర్చుకోవటానికి ప్రజలు సంతానాన్ని ఆశించారు. జనాభా తక్కువగా వున్న దశలో అడవులను నరికి సేద్యపు భూములను తయారు చేయడానికి ప్రజాభివృద్ధి ఆవశ్యకతను సమాజం గుర్తించింది. పౌకగా శ్రమ శక్తి లభిస్తేనే తప్ప పెట్టుబడిదారీ విధానం సాగని పరిస్థితి ఉదయించి కార్మిక జనాభా పెరుగుదలను కాంక్షించటం సాగింది. సంఘర్షణలు, యుద్ధాలు అనివార్యమని తలచి యుద్ధాలలో మానవ బలాన్ని సంతరించడం కోసం జనాభాను పెంచాలనే వాదన బయలుదేరింది. ఇలా సంతానమే ప్రథమ లక్ష్యంగా వివాహ వ్యవస్థ కొనసాగటం చూస్తున్నాం. వివాహ వ్యవస్థకు ఆధారాలు, ప్రాతిపదికలు అనేకం వున్నాయి. ఏదో ఒక అంశాన్ని నిర్ణాయక మయినదని అభివర్ణించలేము.

వైవాహిక జీవితంలో కలిసి మెలసి జీవించడంపై ఇటీవల నొక్కుపెడుతున్నది సమాజం. ఒకనాడు భార్యాభర్తలను బండి చక్రాలుగా పోల్చినా ఈనాడు ఒక చక్రమే-అంటే భర్త పాత్రధారి మాత్రమే-తిరిగేది. ఈనాడు వివాహాన్ని ఇరువురు సమానస్థులైన స్త్రీ పురుషుల సమిష్టి జీవితంగా పేర్కొంటున్నాం. దానితో ప్రేమకు విలువ హెచ్చింది. పూర్వం వివాహం ముందుగా జరిగేది. తదుపరి దంపతులు ప్రేమించుకోవడం తటస్థిస్తే ఈనాడు ప్రేమించుకొని పెళ్ళాడటం పసందుగా తోస్తున్నది. అలా ప్రేమ వివాహాలకు ఆస్కారం కలుగుతున్నది.

ప్రేమ అనే పదాన్ని అపహాస్యం చేసేవారు కూడా ఈ సమాజంలో లేకపోలేదు. ప్రేమకు ప్రాధాన్యత లేకుండా జరిగిన వివాహాలలో-కేవలం వివాహం వ్యాపార ప్రక్రియగా వున్న సందర్భాలలో-ప్రేమ వివాహాల పట్ల వ్యతిరేకత కనపడుతున్నది. ప్రేమ అనే పదానికి సరైన నిర్వచనం ఇవ్వనందు వల్ల ఈ సంకట స్థితి సంభవిస్తున్నది. కామం, మోహం, ప్రేమ విభిన్న భావాలు. ఇందులో ప్రేమ ఉత్కృష్టమైనది. అవతలి వ్యక్తిని గౌరవించటం, రెండవ వ్యక్తి భావాలను సహనంతో పరిగణించడం, అర్థి

కొరకు లేక ఆమె కోసం త్యాగం చెయ్యడం ఇవన్నీ ప్రేమ ఫలితాలు. ప్రేమికుల మానసిక స్థితి ఆలోచనతో ప్రారంభమై ఉద్వేగంతో ఉన్నత స్థాయికి చేరుతుంది. క్రమేపి తాదాత్మ్య భావన చోటు చేసుకుంటుంది. ప్రేమ లేని వైవాహిక జీవితం నిస్సారమని అందరూ అంగీకరిస్తున్న పరిస్థితిలో వివాహబంధం ప్రేమ ప్రాతిపదికగా ఏర్పడటం సముచితం. అదీకాక సమాజంలో పారిశ్రామికీకరణ జరిగి నగర జీవనం పెరుగుతున్న కొలది అణు కుటుంబాల ఉనికి, పెరుగుదల పెరిగిపోతోంది. ఇలాంటి కుటుంబాలకు ప్రేమవినా మరొకటి ఆధారభూతం కానేరదు.

ఇంతవరకు స్త్రీని ఇల్లాలుగా, సంతాన సాధనంగా, పనికత్తెగా, సెక్స్ సందర్భంగా ప్రేయసిగా మాత్రమే పురుషుడు పరిగణిస్తూ వచ్చాడు. ఆమెను వ్యక్తిగా, స్వేచ్ఛాయుత జీవిగా, సమాజంలో సమాన హోదాగల మనిషిగా, రాజ్యంలో పురుషునితో సమ దీటయిన పౌరురాలిగా, సమర్ధురాలిగా ఇంతవరకూ గుర్తించలేదు. ఆమెను జీవం వున్న సొత్తుగా, బానిసగా, ద్వితీయశ్రేణి పౌరురాలిగా మాత్రమే చూచాడు. ఆమె తనకు చెందవలసిన హోదాను పొందాలంటే, దాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలంటే ఆమెను లక్ష్యంగా పెట్టుకునే ప్రేమ వివాహం వల్లనే అది సాధ్యమవుతుంది.

కుటుంబ సంప్రదాయం పేరుతో అంతస్తు, సామాజిక హోదా, వరహీనం పనికి రాదనే భావన, జాతకాలు కుదరాలనే వూహ, పెద్ద పిల్లకు పెళ్ళికానిదే రెండో పిల్లకు పెళ్ళి చేయరాదనే ఆచారం ఇవన్నీ స్త్రీ పురుషులు ఒకరి నొకరు ఎన్నుకోవటానికి అడ్డంకులవుతున్నాయి. వరుని ఎంపికను వధువు తల్లిదండ్రులే చేయాలనే అభిప్రాయం వెనుక అనేక అంశాలు దాగి వున్నాయి. వయోజనులయినా తమ భవిష్యత్తును తాము నిర్ణయించుకోలేరని తల్లిదండ్రుల వూహ. అంతేకాక కన్యాదానం చేయాలనే వుబలాటం కూడా వుంది. కన్య, దానానికి అర్హమయిన వస్తువన్న మాట. ఈ అపోహలు ప్రేమ వివాహాలకు అవరోధంగా నిలుస్తున్నాయి.

హిందూ సమాజంలో వరకట్న విధానం ప్రబలంగా వున్న విషయం అందరం అంగీకరిస్తున్నాం. ఈ దురాచారం ముస్లిం సమాజంలో కూడా పాకుతున్నది. కూతుర్ని కన్నందుకు మామగారికి వరుడు వేసే జుల్మానా అని ఒకరంటే, కుమారుని మీద పెట్టిన పెట్టుబడికి అతని తల్లిదండ్రులు ఆశించే లాభమని మరొకరు పేర్కొన్నారు. వధూవరులిద్దరినీ త్రాసులో తూస్తే వధువు తేలిపోతుందని మనకు తెలుసు. ఆమెను వరునితో సమానం చేయటానికి ఇచ్చేది కట్నం. వధువును జీవిత కాలమంతా పోషించటానికి అంగీకరించినందుకు వరునికి ఇచ్చే లంచమని కొందరు దాన్ని చిత్రిస్తున్నారు.

ఏదయినా పెళ్ళి బజారులో వరునికి ధర పలుకుతున్నది. అలాంటి పరిస్థితుల్లో వేలు లక్షల పరిమాణంలో వున్న కట్నాన్ని వదులుకొని ప్రేమ వివాహానికి సిద్ధమయ్యే పురుషులు చాలా అరుదుగా కనిపిస్తారు. తగినంత వరకట్నం తేలేదని భార్యలను హింసించి హత్యలు చేసే పురుష పుంగవుల సంఖ్య నానాటికీ పెరగటం శోచనీయం. సమానత్వ సాధనకై స్త్రీలు జరిపే పోరాటంలో భాగంగా ఈ వరకట్న దురాచార నిర్మూలన సాగవలసి వున్నది. ఇందుకు స్త్రీ పురుషులు, యువతీ యువకులు నడుం కట్టాలి.

ఒకనాడు వృత్తులపై ఆధారపడిన కులవ్యవస్థ నానాటికీ ఘనభవించి సమాజాన్ని కలుషితం చేసింది. ప్రతిలోమ వివాహాలు కూడా చెల్లుతాయని శాసనం వచ్చినా సమాజంలో కులాంతర వివాహాలు, కులప్రసక్తి లేని వివాహాలు చాలా తక్కువ సంఖ్యలోనే జరుగుతున్నాయి. ఇలాంటి వివాహాలను ప్రోత్సహించే సంఘాలు ఏవో కొన్ని నగరాలలో పనిచేస్తున్నా ఆ ఉద్యమ ప్రభావం చిన్న పట్టణాలకు, కొద్ది బస్తీలకు, గ్రామాలకు విస్తరించ లేదు. తక్కువ వర్ణమని చెప్పబడేదానికి చెందిన పురుషుడు అగ్ర వర్ణమని పేర్కొనబడిన స్త్రీని గ్రామంలో పెళ్ళి చేసుకోవటం తటస్థిస్తే ఆ దంపతుల ప్రాణాలకే మోసం వాటిల్లుతున్నది. ప్రేమకు భాష, కులం, దేశం, జాతి అడ్డు రాకూడదు కదా! స్త్రీ స్వేచ్ఛను ఈ కుల వ్యవస్థ కూకట వేళ్ళతో త్రుంచివేస్తున్నది. భయ సంకోచాలు ఉన్నచోట ప్రేమకు చోటుండదని మనందరికీ తెలుసు. కుల వ్యవస్థను త్రోసి రాజనగల స్థితికి ఎంత త్వరగా వస్తే అంత తేలిగ్గా వారు స్వేచ్ఛను పొందగలరు.

దేవునికి, వ్యక్తికీ వుండే సంబంధాన్ని మాత్రం నిర్దేశించవలసిన మతం సమాజంపై విలయతాండవం చేస్తున్నది. కుటుంబ సభ్యుల మధ్య, కుటుంబాల మధ్య, మతస్థుల మధ్య సంబంధాలను నిర్ణయిస్తున్నది. ఒక మతం వారు మరొక మతంవారితో ఎలా మెలగాలో నియంత్రణ చేస్తున్నది. ఇతర మతస్థులను పరాయివారి వలె చూడమని ఆదేశిస్తున్నది. దాంతో మత విద్వేషం పెచ్చుపెరుగుతున్నది; మత కలహాలు సంభవిస్తున్నాయి. విభిన్న మతస్థులకు చెందిన స్త్రీ పురుషులు వివాహమాడటానికి ప్రత్యేక వివాహ శాసనం అవకాశం, వెసులుబాటు కలిగిస్తున్నా ఒకే మతంలో జరిగే పెళ్ళికన్నా మతాంతర వివాహం కష్ట భూయిష్టమవుతున్నది. అంతేకాక అలా వివాహం చేసుకున్న వారిని ఇరు మతాలకు చెందిన సంప్రదాయ వాదులు, చాంధసులు ఇబ్బందుల పాలు చేస్తున్నారు. మతం స్త్రీ స్వేచ్ఛకు గొడ్డలి పెట్టుగా పనిచేస్తున్నది. ఇస్లాం మతంలో

ఈనాటికీ బహుభార్యాత్వం ఆమోద యోగ్యంగా వున్నది. తలాక్ అని మూడుసార్లు వుచ్చరించి పురుషుడు భార్యను పరిత్యజించ గలుగుతున్నాడు. ఇలా మతం ప్రేమ వివాహాలకే కాక స్త్రీ స్వేచ్ఛకు ఆటంకంగా నిలుస్తున్నది.

ఇటీవలి కాలంలో శాసనాలు చాల వరకు అభ్యుదయ మార్గాన పయనించినయి. కాని అవి చాలవరకు ఇంకా లోపభూయిష్టంగానే వున్నాయి. ఉ॥ ముసల్మాన్ మతానికి చెందిన తల్లిదండ్రులకు జన్మించిన వ్యక్తి మతం మారితే తప్ప ముసల్మాన్‌గానే పరిగణింపబడతాడు. ముస్లింగా పుట్టిన వ్యక్తి అన్ని మతాలలో విశ్వాసం లేక మరొక మతాన్ని చేపట్టకపోతే అతడు ముసల్మాన్ గానే చలామణి అవుతాడు. అంటే అన్యాయంగా వున్న కొన్ని ముస్లిం శాసనాలు అతణ్ణి బద్ధపరుస్తాయి. అదీకాక ప్రత్యేక వివాహ శాసనం క్రింద పెళ్ళాడేవారు ముప్ఫయి రోజులు వ్యవధితో నోటీసు ఇవ్వాలి. హిందూ, ముస్లిం వివాహాలకు ఈ వ్యవధి అవసరం లేదు. ఇలా శాసనాలు స్త్రీలను అనేక ఇక్కట్ల పాలు చేస్తున్నాయి. కనుక శాసనాలను సవరించడం, కామన్ సివిల్ కోడుకు ప్రవేశపెట్టడం చాలా అవసరం. విశ్వమానవ హక్కుల ఆధారంతో ఒకే ఒక వ్యవహార సంహితను అవశ్యం తయారు చేయాలి.

శాసనం ప్రకారం కులాంతర, మతాంతర వివాహాలకు అభ్యంతరం లేకపోయినా శాసనాలను అమలు పరిచే పోలీసు సిబ్బంది ఇలాంటి వివాహాలను ఆదరించడంలేదు, ప్రోత్సహించడంలేదు మేజర్లయిన కుమార్తెలు తల్లి దండ్రులకు ఇష్టంకాని పెళ్ళిళ్ళు చేసుకుంటే వారిని మైనర్లుగా పేర్కొని ఆమె వివాహ మాడిన పురుషునిపై తప్పుడు కేసులు బనాయిస్తుంటే పోలీసులు తల్లిదండ్రులకు వత్తాసు పలుకుతున్నారు. వరుణ్ణి అరెస్టుచేసి, చీకాకు పరిచి బెదిరించి వధూవరులను నిందిస్తున్నారు. అంటే కేవలం సమాజపు బూజుపట్టిన భావాలను పోలీసులు బలపరుస్తున్నారు, తప్ప ప్రోత్సహించడం లేదు. ప్రభుత్వ ప్రకటనలు అభ్యుదయ కరంగా కనిపించినా పోలీసుల ధోరణి సమాజపు విధానాలు వేరుగావుంటుంన్నాయి. ఇది దరహం మీద చెప్పేమాట

భర్త ఉద్యోగం చేసే చోటనే భార్య ఉద్యోగం చెయ్యాలని అనేక హైకోర్టులు తీర్పులు చెప్పాయి. ఇది ప్రమాదకరమైన ధోరణి—స్త్రీ పురుషుల సమానత్వానికి ఇది పెద్దదెబ్బ. స్త్రీని కేవలం పురుషుని అధీనం చేయటం తప్ప మరేమీకాదు. కుటుంబ న్యాయస్థానాల నియామకం ఇటీవలనే జరుగుతున్నది. వాటి పనితీరును జాగ్రత్తగా పరిశీలించవలసివుంది. సాధారణ న్యాయస్థానాలు మొత్తంమీద మహిళా వ్యతిరేక వైఖరులు ప్రదర్శించడం శోచనీయం. రాజ్యాంగం యొక్క 14వ అధికరణంలోని సమా

నత్వ సూత్రాన్ని సరిగా అమలు పర్చలేక పోవడం విషాదకరమైన అంశం. ఉ॥ తనకు ప్రత్యేకంగా నష్టం లేకపోయినా ఏ మత శాసనమైనా రాజ్యాంగ ప్రకారం చెల్లదని వాదించే హక్కు, తాహతు పౌరులకు కల్పించడం న్యాయస్థానం యొక్క విధి. ప్రజా శ్రేయస్సుకు సంబంధించిన వ్యాజ్య గ్రంథం జరిపే హక్కు (RIGHT TO INITIATE PUBLIC INTEREST LITIGATION) ప్రతి పౌరుడికి అన్ని విషయాల్లో వుండాలి. ఇలాంటి అవకాశం లేకపోతే అసమానత్వాన్ని శాశ్వతం చేస్తున్న శాసనాలు రాజ్యాంగ సమ్మతమైనవిగా చలామణి అయ్యే ప్రమాదం వుంది. ఉ॥ క్రయిస్త విడాకుల చట్టం అలాంటిది. న్యాయస్థానాలలో జరిగే ఇలాంటి అవక తవకలవల్ల స్త్రీల స్వేచ్ఛ కుంటుపడుతున్నది. ప్రేమ వివాహాలు చేసుకునే సాహసం కొరవడుతున్నది.

ప్రేమ వివాహాలు చేసుకున్న వారిని మిగతావారు వింతగాచూస్తారు. తాము చేయలేని పనిని ఆ ప్రేమిక దంపతులు సాధించి నందున వారిపై ఈర్ష్యాసూయలు పెంచుకుంటారు. వారికి ఏమాత్రం ఇబ్బందికలిగినా సానుభూతితో సహాయము చేయక ఇరుగు పొరుగువారు ఈసడిస్తారు; నిందిస్తారు. వారిపై విషప్రచారం సాగిస్తారు. ఇదంతా సమాజపు వెనుకబడిన తనానికి నిదర్శనం. చుట్టు ప్రక్కలవారి ఈ వ్యతిరేక వైఖరి ప్రేమవివాహాలు ఆదరణ పొందక పోవటానికి కారణ భూతం.

పాశ్చాత్య ప్రపంచంలో వివాహ వ్యవస్థ అనేక రూపాంతరాలు చెందుతున్నది. అవివాహిత మాతలు, అవివాహిత దంపతులు మనకు తరచుగా కనిపిస్తున్నారు. వితంతు స్త్రీయో, లేక విడాకులు పొందిన స్త్రీయో యజమానురాలిగావున్న కుటుంబాల సంఖ్య పెరుగుతున్నది. ఇదంతా విపరీతంగా మన దేశస్థులకు తోచవచ్చును, కాని మనదేశంలో కూడా త్వరితగతిన మార్పులు వస్తున్నాయి. బొంబాయి లాంటి మహానగరాల్లో పెళ్ళి చేసుకుంటే కాపురముండటానికి ఇల్లు దొరకక, భార్యను పోషించగల ఆర్థిక స్తోమతు లేక అనేకమంది పురుషులు బ్రహ్మచారులుగా వుంటారు. వరకట్నం ఇవ్వనందు వలననో లేక ఇవ్వలేనందు వలననో లేక సరిఅయిన వ్యక్తి సకాలంలో తటస్థించక పోవటం వల్లనో అనేక మంది స్త్రీలు అవివాహితలుగా మిగిలిపోతున్నారు. చాలామంది వృద్ధ కన్యలుగా భాసిల్లుతున్నారు. మరి నూతన ప్రక్రియలను చేపట్టకుండా వీరు ఎంతకాలం సహించి వూరుకుంటారు? కేవలం పాశ్చాత్య సమాజపు పోకడలను అనుకరించక పోయినా ప్రజానీకం నూతన మార్గాలను అన్వేషించక తప్పదు. 21వ శతాబ్దపు చివరకు పరిస్థితి ఎలాగుంటుందో ఊహించటం కష్టతరం కాదు. ప్రేమ వివాహాలు సర్వ సాధారణ మవుతాయి, వివాహం లేకుండా కలిసి కాపురం చేయడం అనింద్యమవుతుంది.

అవివాహిత తల్లులను వ్రేలెత్తి చూపటం తగ్గిపోతుంది. ఇంకా ఇలాఎన్నో మౌలిక మార్పులు రానున్నాయి. స్త్రీలకు ఇతోధికంగా స్వేచ్ఛా సమానత్వాలు లభిస్తాయి.

మారుతున్న సమాజంలో స్త్రీల పాత్రను విద్య, ఉద్యోగం, వివాహం లాంటి రంగాలతో స్పష్టీకరించటానికి ప్రయత్నించడం అత్యవసరం. భారతదేశంలో స్త్రీ జీవితాన్ని అధికంగా శాసించేది వివాహ వ్యవస్థ కనుక దానిని గురించి చర్చించడం యుక్తియుక్తమే. కాగా వివాహవ్యవస్థ సందర్భంగా స్త్రీకి కలుగుతున్న ఇబ్బందులు, ఇక్కట్లు వస్తున్న చిక్కులు అనేకం. వరుని ఎంపిక, వరకట్నం, అత్తవారింట జీవితం మనోవర్తి, విడాకులు, పిల్లల సంరక్షకత్వం ఇవన్నీ వివాహవ్యవస్థకు సంబంధించినవే. అయినా ఇన్నింటినీ ఇక్కడ పొందుపరచటానికి అవకాశం లేదు. కనుక వరుని ఎంపిక అంశాన్ని మాత్రమే తీసుకొని వివాహ, వ్యవస్థలో స్త్రీల సమస్యలు చర్చించడమైనది.

స్త్రీ స్వేచ్ఛను పరిమితం చేసేవి సమానత్వాన్ని లేకుండా చేసేవి అనేకం సమాజంలో మనకు సాక్షాత్కరిస్తున్నాయి. కుటుంబ సాంప్రదాయాలు, మూఢవిశ్వాసాలు, కులసంకెళ్ళు, మతకట్టుబాట్లు సామాజిక ఆచార వ్యవహారాలు, శాసనాల లోపభూయిష్టత, ప్రభుత్వ యంత్రాంగపు పనితీరు. న్యాయస్థానాల నత్తనడక ఇవన్నీ పురోగమిస్తున్న స్త్రీకి ఆటంకాలు అవరోధాలు కల్పిస్తున్నాయి. వీటిని అధిగమించాలంటే ఏ ఒక్క పరిష్కారమార్గమూ తగినంతగా విజయాన్ని చేకూర్చలేదు. అయినా కొన్ని పరిష్కార మార్గాలు తతిమ్మా వాటికన్నా మెరుగుగా పనిచేస్తాయి. అలాంటి వాటి కోవకు చెందిందె ప్రేమ వివాహం, ప్రేమ మీదనే ఆధారపడి జరిగే వివాహంలో ఆర్థిక అసమానతలు, హెచ్చుతగ్గులు, పురుష ప్రాధాన్యత, స్త్రీ న్యూనతా భావాలు, అంధ విశ్వాసాలు పటాపంచలవుతాయి. వరకట్న పిశాచి ఎగిరిపోతుంది. కులపు వూసే రాదు. మత ప్రభావం అణగారి పోతుంది. సామాజిక ద్వేషం సమసిపోతుంది. దంపతుల మధ్య అన్యోన్యతా, అనురాగం చోటుచేసు కుంటాయి. సమానత్వం ఆచరణలో కూడా అందుబాటులోకి వస్తుంది. స్త్రీ వ్యక్తిగా గౌరవింపబడుతుంది. ప్రజాస్వామ్యం అన్ని రంగాల్లో వెల్లి విరుస్తుంది. ప్రేమవివాహాల సంఖ్య పెరిగేకొద్దీ సమాజం అభ్యుదయం వైపు పయనం సాగిస్తుంది. మహిళలకు న్యాయం చేకూరుతుంది. కనుక ప్రేమ వివాహాలు విధిగా అమల్లోకి రావాలి.

# వివాహానంతరం స్త్రీ జీవిత విధానం

వివాహంతో స్త్రీ తన సర్వశక్తులను, ఇష్టాఇష్టాలను పూర్తిగా భర్తకు ఎందు కర్పిస్తోంది? అసలు వివాహం అనేది స్త్రీలకే అవసరమా? పురుషులకు ఇది వ్యాపారమా? లేక వినోదమా? ప్రేమానురాగాలపై ఆధారపడవలసిన ఆ బంధంలో హింస, దౌర్జన్యము, అసమానత్వమూ, పురుషాధిపత్యమూ, స్త్రీల అణచివేత ఎందుకు చోటుచేసుకున్నాయి? స్త్రీల హత్యలు, ఆత్మహత్యలు ఎందువల్ల పెరుగుతున్నాయి? కన్నవారి కడుపు కోతకు, అబలల అకాల మరణాలకు కారణం నేటి సమాజమా? స్త్రీలా? పురుస్త్రీలా? అనేవి నేడు మన ముందున్న శేష ప్రశ్నలు. ఈ దుస్థితి మారాలంటే స్త్రీ నడవడి, ఆమె జీవిత విధానంలో మార్పులను అన్వేషించక తప్పదు.

వివాహానంతరం స్త్రీ జీవన సంరక్షణ ఎలా జరగాలి అన్నప్పుడు వివాహానికి పూర్వమే స్త్రీ విజ్ఞానవతి అయివుండాలి. ప్రపంచ జ్ఞానాన్ని పొందివుండాలి. సామాజిక దౌష్ట్యాలను అర్థం చేసుకొని వుండాలి. కుటుంబ వ్యవస్థ గురించి, పాత ఆచారాలను గురించి, ముఖ్యంగా గృహిణిగా తన స్థానాన్ని గురించి, భార్యల కర్తవ్యాన్ని గురించి, తల్లిగా ఆమె బాధ్యతల గురించి, భర్తల అధికారాన్ని ఇలా ఎన్నో విషయాల నవగతం చేసుకున్న స్త్రీ మాత్రమే దాంపత్య జీవిత రంగంలో తన సంరక్షణను, తన స్థాయిని, తన స్వేచ్ఛను నిలుపుకోగలుగుతుంది. ఆ ధైర్య స్థయిర్యాలు లేని స్త్రీ హతాశురాలై ఆత్మార్పణకు గాని, హత్యకు గాని, "శాడిజా"నికి గాని గురి అవుతోంది. బాల్య వివాహాలు నశించిన ఈ రోజుల్లో వయస్సుతో పాటు సామాజికావగాహన, వివాహ వ్యవస్థా, కుటుంబ సంక్షేమం ఆర్థిక, రాజకీయ పరిస్థితి లాంటి ఎన్నో విషయాలను తమ విద్యల ద్వారా, వివేకం ద్వారా గ్రహించగల పరిస్థితి ఈనాటి మహిళలకు దక్కింది. కనుక స్త్రీలు స్వతంత్రాలోచనను ముందుగా నేర్చుకోవాలి.

"నేను ఫైనల్ బి.ఏ. పరీక్షకు వెళ్ళటం లేదండీ!" అన్నది సరోజ. ఉలిక్కిపడి ఇంత తెలివైనదానివి ఎందుకు మానుకుంటున్నావని ప్రశ్నించా. ఆ మర్నాడే మాధవి వచ్చి నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చానమ్మా! ఈ వూరు విడిచి పోయే ముందు మీతో చెప్పి వెడదామని వచ్చానన్నది నిరాశా, నిస్పృహలతో. "Would be" కాదన్నాడా? అమ్మా నాన్నా వద్దన్నారా? తలవొంచి బొటనవ్రేలు నేల రాస్తోంది.

పెళ్ళి కుదరగానే అమ్మాయి అబ్బాయి ఆస్తి అయిపోతోంది. అందుకే పెళ్ళి చదువు, పెళ్ళి ఉద్యోగాలకు నేటి అమ్మాయిలు ఆహుతి అయిపోతున్నారు. ఉద్యోగిని

కావాలని కొందరు వరులు "డిమాండ్" చేస్తున్నారు అంటే కట్నమే కాక పాడి ఆవు లాంటి స్త్రీ కావాలని వారి వాంఛ. ఆమె డబ్బుపై మక్కువే కాని ఆమె వ్యక్తిత్వం, సమానత్వం కోరి కాదని మనం గ్రహించాలి. విద్యార్థినులు సైతం వివాహం అనే రథం కొరకు నిరీక్షిస్తూ వుంటున్నారు. చదువు అంటే చదవటం వద్దంటే మానెయడం వారి కర్తవ్యంగా భావిస్తూ తలవంచి తాళి కట్టించుకుంటున్నారు వారికి ఒక ధ్యేయం కాని, లక్ష్యం కాని వుండదు. "ఆడది పుట్టింది పెళ్ళికొరకే; బిడ్డల్ని కనటానికొరకే" అని అమ్మమ్మ చెప్పే మాటలు విని ముదిసిపోతున్నారు. కొందరు అమ్మాయిలయితే కాబోయే భర్త అందంగా వుండాలని, గొప్ప ఉద్యోగస్తుడు, ధనవంతుడై వుండాలని వాంఛిస్తూ వుంటారు. తనను అమితంగా ప్రేమిస్తాడని, ఆరాధిస్తాడని కలలుకంటూ వుంటారు. ఆ కోరికలు నిరాశలయినప్పుడు మానసిక వ్యవధితో కుమిలిపోతారు. మరో అసభ్య విషయమేమంటే పెళ్ళి చూపుల తంతు: వరుడికి అమ్మాయి నచ్చితే చాలు. అంటే ఏకపక్ష నర్ణయానికి మన అమ్మాయిలు ఆనందపడి పోతున్నారు. ఆ మైకంలో రేపు ఎంత ఘోరం జరుగుతుందో, ఈనాడు వున్న కొద్ది స్వేచ్ఛను పెళ్ళికాగానే ఎలా అపహరిస్తాడో ఊహించుకోరు. పైగా ఎలాగో అలా ఆ అమ్మాయిని వదిలించుకోవాలనుకునే తల్లిదండ్రులు కాస్తంత సర్దుబాటు చేసుకొని సాఫీగా జీవితాన్ని వెళ్ళబుచ్చుకో తల్లీ! అంటారు. అంటే 'భర్త పెడితే తినూ, కొడితే పడూ' అనే నీతి అందులో వుంటుంది. పైగా ఉత్తమ గృహిణి (పూర్తిగా లొంగిపోయిన), ఆదర్శ మహిళలు అంటూ సీతా, సావిత్రి, దౌపది లాంటి మహిళల జీవితాలను వల్లెవేస్తారు. ఆడపిల్లలను పెంచే విధానంలో వారిని అస్వతంత్రులుగా తయారు చేస్తారు. అందు వల్లే చదువువున్నా, లేకున్నా అమ్మాయిలు పూర్తిగా పెళ్ళిళ్ళకోసం పెద్దల మీదే ఆధారపడి వుంటున్నారు. పెళ్ళితో భర్త అనే ఉన్నతస్థాయి వ్యక్తి భార్య (భరింపబడేది) అనే నీచస్థాయి వ్యక్తి తయారవుతారు. ఇలాంటి దృష్టి వారి పట్ల చూపబడుతున్నాయి. అలా ఆమెపట్ల నిరాదరణ చూపబడుతోంది. ఎప్పటికైనా ఆడ వుండే పిల్లేగదా అనే ఈసడింపుతో ప్రక్కవారి మొక్కకు నీరు పోయడం దండుగే అనే భావంతో ఆడపిల్లను పుట్టుకలో, పెంపకంలో, విద్యా, ఉద్యోగాల్లో చాలా తేడాగా చూస్తారు కన్నవారు. తన స్థితి అంతేనని, రెండవ స్థానమే తనకు శరణ్యమని, ఇంత తిండీ, నీడా ఇస్తే చాలునంటూ గొడ్డుచాకిరి చేస్తూ జీవితాన్ని వెళ్ళబుచ్చు కుంటున్నారు మన ఆడబడుచులు. చట్టాలిచ్చిన హక్కుల ఊసే పట్టించుకోరు. తెలుసుకోరు. అలా తరతరాలుగా వేల సం॥రాలుగా అబలలుగా బ్రతుకుతున్నారు. ధర్మశాస్త్రాలు, పురాణాలు వల్లెవేస్తూ, మగని ధీరత్వాన్ని మెచ్చుకుంటూ తిండి, గుడ్డా

ఇచ్చినందుకు గర్వపడుతూ వుంటారు. కాని తాము పోగొట్టుకున్న దేమిటో తెలుసుకోరు. తమ నష్టాన్ని అంచనా వేసుకోలేని బానిస మనస్థత్వం మననింకా వెన్నాడుతూనేవుంది. అంటే వివాహానంతరం స్త్రీకి వ్యక్తిత్వం, సమానత్వం, స్వేచ్ఛా అన్నీ మృగ్యమవుతున్నాయి.

ఈ పరిస్థితి మారాలన్నా, మహిళలు మగవారితో సమానంగా జీవించాలన్నా, సుఖశాంతులతో వ్యక్తి వికాసంతో ఆత్మ స్థయిర్యంతో బ్రతకాలన్నా తల్లి కాక ముందే, పెళ్ళి కాక ముందే కొంత విషయగ్రహణత మనలో వుండాలి. స్త్రీలలో మానసిక ఆందోళన, అకాల మృత్యువులు తగ్గాలంటే కొన్ని ధర్మ సూత్రాలను అలవరచుకోవాలి. తల్లి అయ్యాక ఆ బిడ్డకోసం ఎన్ని కష్టాలయినా ఆనందంతో అనుభవిస్తుంది స్త్రీ కనుక కన్యగానే ఎన్నో తెలుసుకోవాలి. తీరా చేతులు కాలాక ఏడ్చి లాభం లేదు.

స్త్రీకి తన జీవన సంరక్షణ ఎవరో ఇచ్చేది కాదు. మనం పుచ్చుకునేవారం అంతకన్నా కారాదనేది ముఖ్యంగా ముందుగా మనం తెలిసికోవాలి. మన్ని మనమే ఉద్ధరించుకోవాలి. ఎవరి స్వార్థం వారిది, ఎవరి లాభం వారిది, ఎవరి శ్రేయస్సు, అధికారాలు వారివి. వాటిని అధిగమించి 'మీరు మమ్మల్ని రక్షించండి బాబూ' అంటే మరీ లోకువై పోతాం. పైగా భక్షించటానికి భర్తలు రెడీగా వుంటారు. అందువల్ల తన నడవడిలో, జీవిత విధానంలో క్రొత్త రూపురేఖలనలవరచుకోవాలి. అంటే భర్తపై అధికారం పెత్తనం చలాయించమని కాదు. బండికి రెండు చక్రాల్లా ఎవరి పరిధితో వారుండాలి. ఒకర్ని ఒకరు గౌరవించుకోవాలి; సహాయ సహకారాలు అందివ్వగలగాలి. ఎవరి సలహా ఆచరణ యోగ్యమో ఎవరి ఆలోచన మిన్నదో రెండోవారు అర్థం చేసుకోగల సత్తా వుండాలి. "ఆడదానివి నీకు సలహా ఇచ్చే సామర్థ్యం వుందా" అని ఈసడించరాదు. పిల్లల్ని కనడంలో వారి విద్యాబుద్ధుల విషయంలో తల్లికి కొంత చొరవ వుండాలి. ఆస్తిపాస్తుల కొనుగోలు అమ్మకం లాంటి వాటిలో భార్యాభర్తలిద్దరూ సంప్రదించుకోవాలి అవసరమొస్తే భార్య ఉద్యోగం చేసే చోటికి భర్త వచ్చి వుండే వాతావరణం ఏర్పడాలి. తనకన్నా చిన్న చదువు చదివిన భర్తను పెళ్ళాడ గలిగే చొరవ స్త్రీలలో చోటు చేసుకోవాలి. పిల్లల్ని కనేది స్త్రీయే అయినా పెంచే బాధ్యతలో పురుషులు భాగస్వాములు కావాలి. ఎవరిని ఎవరూ అధిక్షేపించే హక్కూ, అధికారం వుండరాదు. ఆదర్శ దంపతులుగా వుండగలగాలి. పెళ్ళి అయితే స్త్రీకి రక్షణ వుంటుందని, పురుషుడికి సర్వ సౌఖ్యాలు ఇచ్చే సాధనం లభిస్తుందని భావించే పాత భావాలను ధ్వంసం చేయాలి.

భార్యాభర్తల సంబంధం వ్యాపారలక్షణాలతో పోల్చుకోరాదు. వివాహం కేవలం లైంగికానుభూతి కోసం కానే కాదు. వివాహిత స్త్రీ పూర్తిగా అణచివేతకు గురి కావటం సాంఘికద్రోహంగా భావించాలి. శారీరకబలం, మానసిక విద్వత్తు కల స్త్రీని గర్భవతిగా వున్నప్పుడు, బాలింతంగా వున్న సమయంలో ఆమెకు ఆ దదండలు అవసరమైనప్పుడు, పురుషులు ఆమెకు ఉచ్చు బిగించి లొంగదీసుకున్నారు. అలా వేల సం॥రాలుగా ఆమెను దాస్యంలో వుంచారు. ఆచారాలు, సిద్ధాంతాలు, ధర్మశాస్త్రాలు ఇంకా ఆమెపై ఆంక్షలు విధించాయి. హక్కులు వమ్ము చేసాయి. ఈనాటి స్త్రీ ఆమూసలో ఇమడలేక పోతుంది. మహిళా దశాబ్దంవల్ల, పాశ్చాత్య ప్రభావం వలా, సాంకేతిక అభివృద్ధివల్ల స్త్రీలలో కొంత వికాసం, మార్పువచ్చాయి సనాతన, ఆధునిక భావాలమధ్య వారు నలిగిపోతున్నారు. 21 శతాబ్దంలో అనేక మార్పులు వస్తాయి. ఆ మార్పువల్ల అభివృద్ధి వుండక తప్పదు.

ఈనాటి పెళ్ళికి ప్రధానపాత్ర వహించేది కట్నం. ఆ దుర్నీతిపై స్త్రీలే తిరగబడాలి. కులం, మతం, వ్యాపార దృక్పధంతో నిమిత్తంలేని భాగస్వామ్యాన్ని ఇద్దరూ వాంఛించాలి. స్త్రీకి మాత్రమే వివాహం విధిగా జరగాలనే ద్వంద్వ నీతిని స్త్రీలు నిరసించాలి వివాహాల్లో దుబారా, ఆడంబరాలు తలకు మించిన ఖర్చులు, హోదాలు వ్యతిరేకిస్తూ యువతులు పోరాటాలు సాగించాలి. హెచ్చుతగ్గులకు నాందిఅయిన కన్యాదానాన్ని కన్యలు విధిగా వ్యతిరేకించాలి సప్తపదిలో పురుషుడు ముందుగా స్త్రీ వెనుకగా వుంటూ అడుగులువేసే పద్ధతిని నిరసించాలి. పెళ్ళికిముందు ప్రేయసీ ప్రియులిద్దరూ, పరిచయం చేసుకోవటానికి, కలిసి తిరగటానికి అవకాశం కలిగించాలి. విద్యావిధానంలో వివాహంలో సమస్యలు, భార్యాభర్తల అనుబంధం, స్త్రీ పురుష సమానత్వాన్ని సూచించే పాఠ్యాంశాలను విధిగా చేర్చాలి. అలాగే కట్న సమస్యలు, స్త్రీలపై భర్తల అత్యాచారాలు, అత్త మామల హింసలు లాంటివి వివరించాలి. అప్పుడే యువతీ యువకులిద్దరూ పెళ్ళి అంటే ఏమిటో, దాంపత్య మంటే ఏమిటో కుటుంబ వ్యవస్థ ఎందుకో గుర్తిస్తారు. లోపాలను సరిదిద్దు కుంటారు. ముఖ్యంగా బాధితురాలైన గృహిణి తనను తాను ధైర్య స్థైర్యాలతో సరిదిద్దుకుంటూ కుటుంబ లోపాలను సవరిస్తుంది. భర్తకు గుణపాఠం నేర్పుతుంది. ఆత్మహత్యా ప్రయత్నం నుండి హత్యలనుండి బైటపడుతుంది.

# దగా పడిన "భార్యలు"

హిందువులలో ఏకపత్నీత్వము, ఏకపతిత్వం విధిగా అనుసరించాలి. ఒక పురుషుడు అనేకమంది స్త్రీలను భార్యలుగా స్వీకరించరాదు. అలాగే ఒక స్త్రీ అనేకమంది పురుషులను ఏకకాలమందు భర్తలుగా ఏర్పరచుకోరాదు. ఈనాడు ఈ విషయాన్ని ఇంత గట్టిగా చెప్పాలా అనే సందేహం కలుగుతుంది. కాని మన రాష్ట్రంలో 1948కి పూర్వం అంటే నలుబది ఏండ్లనాడు ఒక హిందూ పురుషుడు లక్షల మంది స్త్రీలను ఏక కాలంలో భార్యలుగా కలిగి ఉండటానికి ధర్మశాస్త్రం అడ్డు రాలేదని జ్ఞాపకం చేస్తే కొందరికి కోపం వస్తుంది; మరికొందరు బాధపడతారు. ఆచరణలో అలా జరిగిందని కాదు. శాస్త్రం అనుమతించిందనేదే విషయం. కాశేశ్వరరావు గారి ధర్మమా అని వచ్చిన శాసనం, తరువాత 1955 హిందూ వివాహ శాసనమూ పరిస్థితిని మార్చి ఏకభర్తృత్వం, ఏక భార్యాత్వం తప్పనిసరి అని తేల్చాయి.

శాసనాలు ఎలా ఉన్నా ప్రజల మనస్తత్వం ఇంకా మారలేదు. తనకు పిల్లలు కలుగక పోతే సవతిని తెచ్చుకోడానికి సిద్ధపడే విద్యావతులైన స్త్రీలు లేకపోలేదు. తను వ్యాధిగ్రస్తురాలయితే భర్తకు మరో స్త్రీని కట్టబెట్టాలని ఆలోచన చేసే స్త్రీలూ ఉన్నారు. అలా కాక తన సుఖం కోసం, తన సౌకర్యం కోసం ద్వితీయ వివాహానికి తయారయ్యే పురుష పుంగవులూ ఉన్నారు. ఇది శోచనీయ స్థితి.

స్త్రీకి వివాహం తప్పని సరి అని భావించే సమాజం మనది. ఆడపిల్ల పుట్టినది మొదలు ఏ అయ్య చేతిలో పెట్టి తమ భారాన్ని వదిలించుకుందామా అని తల్లిదండ్రులు ఆలోచిస్తున్న సంఘం మనది. ఆ ఆదుర్దాలో, ఆ తపనలో తన పిల్లను పెండ్లి చేసుకుంటానన్న "మగ పురుషుడు" తటస్థించగానే ఎగిరి గంతేసి అతని పూర్వాపరాలు క్షుణ్ణంగా తెలుసుకోకుండా అతనికి ఇచ్చి తమ కుమార్తెకు పెండ్లి చేస్తారు. కొన్ని సందర్భాలలో వారు పప్పులో కాలేస్తారు; మోసపోతారు. అతనికి అంతక్రితమే ఒక భార్య, పిల్లలు ఉంటారు. ఈ విషయం మొదటిలో బయటపడదు. కూతురు కాపురానికి వెళ్ళి మూడు నాలుగు నెలలు కాపురం చేసి, గర్భవతి అయిన తరువాత అసలు అంశం బయటపడుతుంది. అపుడు లబో దిబోమంటారు అందరూ. "ఇష్టమయితే పడి ఉండు లేకపోతే ఇంట్లోంచి లేచిపో" అంటాడు ఆ భర్త. ఆమె పుట్టింటికి చేరుతుంది ప్రసవిస్తుంది. పిల్లను కంటుంది. ఈలోగా మొదటి భార్య రంగ ప్రవేశం చేస్తుంది. ఇల్లు అంతా ఆక్రమించుకుంటుంది. ఆమెయే ఇల్లాలవుతుంది. రెండవ భార్యగా వచ్చానన్ని

తెలుసుకున్న ఆమె తన భరణం కోసం, తన పిల్ల మనోవర్తికోసం కోర్టుకు వెళుతుంది. దాంతో మరోరకపు చిక్కులు ప్రారంభమవుతాయి.

మామూలుగా భార్య, భరణానికి సివిలు కోర్టులో దావా వేయవచ్చును. భర్త ఆస్తిని భరణపు చెల్లింపుకు హామీగా ఉంచమని కోర్టును కోరి అలా ఉత్తరువు పొంద వచ్చును. ఇది కాలయాపన జరిగే వ్యవహారం. ఏండ్లు గడుస్తాయి. మూడు కోర్టులు త్రిప్పి భర్త ఆమెను మూడు చెరువుల నీరు తాగిస్తాడు. ఆమె అలసి పోతుంది; విసిగి పోతుంది. అయితే త్వరగా పరిహారం ఇచ్చే సదుపాయంలేదా అంటే ఉంది. క్రిమినలు ప్రొసీజరు కోడు సెక్షను 125 క్రింద ఆమె తన భరణం కోసం, తన పిల్ల మనోవర్తి కోసం పిటీషను పెట్టి వాటిని సాధించుకోవచ్చును. ఇది త్వరితంగా జరిగే పని. మహా అయితే 3, 4 నెలల్లో ఏదో కొంతపరిహారం వస్తుంది. ఇంతవరకు సజావుగానే కన్పడు తుంది. ఒకే భార్య ఉన్న కేసులో చిక్కులు ఉండవు.

కాగా రెండవ భార్యగా ఉన్న స్త్రీ మనవర్తి అడిగితే ఏమి జరుగుతుంది? ఇలాంటి కేసును సుప్రీం కోర్టువారు పరిష్కరించారు. ఆమె భర్తకు ద్వితీయ భార్య. పురుషుడు భార్య బ్రతికి ఉండగా మరో స్త్రీని వివాహమాడరాదు. అలా చేస్తే అతని రెండవ పెళ్ళి చెల్లదు. రెండవ ఆమెకు భార్య హోదా రాదు. భార్య కానపుడు ఆమెకు భర్త మనోవర్తి చెల్లించనవసరం లేదు. ఇదీ తీర్పు. సెక్షను 125 క్రిమినలు ప్రొసీజరు కోడ్ క్రింద భార్యకు మాత్రమే మనోవర్తి ఇవ్వాలన్నారు కదా. ఆమెకు భార్య స్థానం లేక ఆమె ఉంపుడుగత్తె హోదా కలిగి ఉంది. 'లా' ప్రకారం ఉంపుడుగత్తెకు భరణం ఇవ్వవలసిన పనిలేదు. స్థూలంచా చూస్తే ఇది సబబుగానే కన్పిస్తుంది. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే అనుమానాలు తలెత్తుతాయి.

అతనికి ఒక భార్య ఉందని తెలిసి, అతనిని వివాహమాడి కాపురం చేయటానికి వచ్చిన స్త్రీ విషయంలో ఎవరూ బాధపడరు. విషయం తెలిసి ఆమె అలా ప్రవర్తించింది కదా! ఫలితం అనుభవించక తప్పదు. పైగా మొదటి ఆమెకు అన్యాయం చేయటానికి పూనుకున్న రెండవ స్త్రీ పట్ల ఎవరికీ, సాధారణంగా, సానుభూతి ఉండదు. అలాంటి కేసు పరిష్కారంలో రెండవ ఆమె పెళ్ళి చెల్లదని ప్రకటించినా, ఆమెహోదా 'ఉంపుడు గత్తె' అని లా ప్రకారం తీర్పు చెప్పినా ఎవరికీ అసంతృప్తి ఉండదు. అయితే ఇంకొక రకపు కేసు ఉంటుంది. తనకు వివాహం కాలేదని రెండవ ఆమెను, ఆమె తల్లిదండ్రులను నమ్మించి ఆమెను పెండ్లి చేసుకుంటాడు ఒక 'మహామహుడు'. ఈ మోసం తెలియక పెండ్లి చేస్తారు; జరిగిపోతుంది. రెండవ ఆమె, ఆమె తల్లిదండ్రులు తరువాత

మోసపోయామని తెలుసుకుంటారు. రెండవ ఆమె క్రిమినలు కోర్టులో క్రిమినలు ప్రొసీజరు కోడ్ సెక్షను 125 క్రింద మనవర్తిని కోరుతుంది. అపుడు న్యాయం ఎలా జరగాలి? భార్య కాదు కనుక మనవర్తి రాదని కోర్టు తీర్పు చెప్పాలా? లేక మోసగింపబడిన స్త్రీ కనుక ఆమె యెడల కరుణజూపి సానుభూతితో ఆమె కేసును పరిశీలించి ఆమె 'లా' ప్రకారం భార్య కాకపోయినా భార్యగా పరిగణించి ఆమెకు మనవర్తి ఇవ్వవలెనా? సుప్రీం కోర్టువారు మొదటి పంథాను అవలంబించారు. శాసనాన్ని సవరణ చేయించుకోవాల్సిందే కాని, ఈనాడు అమలులో ఉన్న శాసనాన్ని బట్టి ఆమెకు మనవర్తి ఇవ్వలేమని తీర్పు వ్రాసారు. ఈ తీర్పు సబబుకాదని కొందరి అభిప్రాయం. ఇక్కడ ఒక్క అంశాన్ని ఉటంకించక తప్పదు. న్యాయమూర్తుల శీలాన్ని శంకించకూడదు; వారిని నిందించకూడదు. కాని వారి తీర్పులను విమర్శించవచ్చు. ఒక కోర్టు తీర్పు ఇస్తే ఆ తీర్పుపై అపీలు చేసి పై కోర్టులో విమర్శించటం న్యాయవాదులు మామూలుగా రోజూ చేసే పనియే. కనుక సుప్రీం కోర్టు తీర్పును కూడా ప్రజలు విమర్శించవచ్చును. ఈ విషయాన్ని అనేకమంది పత్రికా విలేఖరులు విస్మరించటం శోచనీయం; అలాగే అనేక మంది ప్రజా సేవకులు తలపోయడం విచారకరం.

ఈ సమస్యపై సరియైన అభిప్రాయానికి రావాలంటే మరికొన్ని అంశాలను పరిగణనలోకి తీసుకోవాలి. బహుభార్యాత్వ నిషేధాన్ని శాసన రూపంగా అమలు పరిపించటానికి మహిళోద్యమం నానా యాతనలూ పడవలసివచ్చింది. భార్య ఉండగా మరో స్త్రీని పెండ్లాడడం నేరం. కాగా నిన్న మొన్నటివరకు మొదటి భార్య మాత్రమే కేసు పెట్టాలి. ఇటీవల ఆంధ్రప్రదేశ్ శాసన సభ వారు ఆమోదించిన బిల్లు శాసనమయింది. దాని ప్రకారం ద్వితీయ వివాహం చేసుకున్న పురుషునిపై భార్య మాత్రమే కాక మరిఎవరయిననూ క్రిమినలు కేసు పెట్టవచ్చును. ఏ పరిస్థితులలోనూ బహుభార్యాత్వాన్ని ఆమోదించరాదని ఈనాటి విజ్ఞుల అభిప్రాయం. ఇకపోతే కొందరు కోరినట్లు రెండవసారి పెండ్లాడిన స్త్రీని భార్యగా పరిగణించి, సెక్షనులోని 'భార్య' అనే పదానికి విస్తృతమైన, విశాలమైన అర్థాన్ని ఇచ్చి ఆ పురుషునిచేత మోసగింపబడి భార్యగా పరిగణింపబడిన స్త్రీని కూడ 'భార్య' అనే పద నిర్వచనం క్రిందికి కోర్టువారు తెస్తే సమాజానికి ముప్పు కలుగుతుంది. ఉంపుడుగత్తెలకు 'భార్య' హోదా దొడ్డిదారిన వస్తుంది. తద్వారా బహుభార్యాత్వానికి ఆస్కారం ఎక్కువ అవుతుంది. మొదటి భార్యను అదలించి, బెదిరించి ఆమె నోరు మూయించి ద్వితీయ వివాహం చేసుకునే పురుషుల సంఖ్య పెరుగుతుంది. ఇది వాంఛనీయం కాదు.

కోగా దగా పడిన స్త్రీ గతి ఏమిటి? ఆమె స్థితి హృదయ విదారకం కాదా? అవును; అందులో సందేహం లేదు. వక్రభాష్యం చెప్పి ఆమెకు భార్య హోదా కల్పించి ఎలాగో తంటాలుపడి ఆమెకు మనోవర్తి ఇప్పించేకన్న శాసనాన్ని మార్పించి "దగాపడి పెండ్లాడి భార్యగా పరిగణింపబడిన స్త్రీకి" పురుషుడు మనవర్తి ఇవ్వాలని సెక్షనులో వ్రాయించటం అలా శాసనాన్ని మార్పించడం మంచిది. అది సూటి అయిన మార్గం.

శాసనాన్ని మార్చడానికి చాల కాలం పడుతుంది. ఈలోగా రెండవ స్త్రీ ఏమి చేయాలి? మోసగింపబడిన స్త్రీగా ఆమె అతనిపై దావావేసి నష్టపరిహారం కోరవచ్చును. అంతే గాక మోసగించినందుకు అతనిపై క్రిమినలు కేసు పెట్టవచ్చును. ఆ ఒత్తిడిని భరించలేక అతడు రాజీకి వచ్చి ఆమెకు కొంత పైకాన్ని గాని, ఆస్తిని గాని చెంద జేస్తాడు.

ఏదైనా ఒకటి రెండు దారుణమైన కేసులను లెక్కలోకి తీసుకొని పదాలకు భాష్యాలు చెప్పటం సాగిస్తే అసలు దరహపు ప్రయోజనం, సమాజ శ్రేయస్సు భంగం అయ్యే ప్రమాదం ఉంది.

బహుభార్యాత్వాన్ని ఆమోదించే చర్యలను మనం ఏ పరిస్థితులలోను ప్రత్య క్షంగా గానీ, పరోక్షకంగా గాని ప్రోత్సహించరాదు.

# విద్య ఎందుకు? ఉరి పోసుకొనేటందుకా?

హత్యలు, ఆత్మహత్యలు, ఉరిపోసుకోవటాలు, ఎండ్రిన్ త్రాగి చావటం లాంటివి రోజు రోజుకూ పెరిగిపోతున్నాయి. ఎవరి నోట విన్నా చావు వార్తలే. ఎక్కడ "న్యూసు" చదివినా హత్యల ఉదంతాలే. అసలు ఇది హత్యల యుగమా, ఆత్మ హత్యల దశాబ్దమా అర్థంకాని అయోమయంలో పడి తల్లడిల్లి పోతున్నాం. చంపటంకాని, చంపబడటం కాని ముఖ్యంగా జరుగుతున్నది మహిళా జాతిపైనే. అంతేకాదు దుర్మర ణాల పాలవుతున్న వారంతా మధ్య వయస్సులో నున్న మహిళామణులే. అంటే 18 నుండి 30 ఏళ్ళ లోపువారే. అదికూడా వివాహానంతరమే. పెళ్ళయిన 5, 6 సం॥రాల లోపలే వారి జీవితాలు మట్టి పాలవుతున్నాయి. నూతన వధువులు వల్లమాలిన కోరిక లతో అత్తవారింట అడుగుపెట్టీ పెట్టకముందే ఎందుకు చస్తారు! లేక చంపబడుతున్నా రనేది ప్రస్తుతం మండుతున్న సమస్య. (బర్నింగ్ ఇష్యూ) అతి ప్రేమతో పెంచు కున్న అమ్మాయిల బాడీలను (శవాలను) తెచ్చుకొని విలపిస్తున్న తల్లిదండ్రుల బాధను ఎవరు అర్థం చేసుకోగలరు? అసలు అమ్మాయిలను కనడమే నేరమా? పాపమా? ఈ వైపరీత్యాలకు కారణమేమిటి? అని ప్రశ్నిస్తే అమ్మాయిల పుట్టుక అశనిపాతం, అబ్బా యిల పుట్టుక ఆశాపాశం కావటంవల్లనే ఈ అమానుష హత్యాకాండలు జరుదుతున్నాయి. వరకట్న మనే విషజాడ్యానికి ఆహుతి అయిపోతున్నది 'అబలా' లోకం. ఈ వరకట్న కోరల్లో మరో వికృత రూపం ధరించిన విషాదగాధ ఇటీవల వెలుగులోకి వచ్చింది.

కట్నం ఇచ్చుకోలేని తండ్రికి భారం కాలేక ముగ్గురు అక్కచెల్లెళ్ళు చేజేతులా ఉరిపోసుకుని మరణించారు. కాన్పూరులో ఒక ఎల్.ఐ.సి. కంపెనీలో ఉద్యోగి అయిన గయాప్రసాద్ సాహూకు ఆరుగురు పిల్లలలో ముగ్గురమ్మాయిలు. వారి వయస్సు 22, 20, 18. పెద్దమ్మాయి పూనమ్ ఎం.ఏ. చదివి సెక్రటేరియట్ కోర్సు చదువుతోంది రెండో అమ్మాయి మమత ఎం.ఏ; మూడో అమ్మాయి అల్కా బి.ఏ. ఫైనల్ చేస్తోంది. పెద్దమ్మాయి పెళ్ళికొరకు నాలుగేళ్ళుగా ప్రయత్నిస్తున్నారు తల్లితండ్రులు. 40 వేలు కట్నం ఇస్తానని అనేక మంది వరుల చుట్టూ నాలుగేళ్ళుగా సాహూ తిరిగి తిరిగి వేసారి పోయాడు. ప్రతి వరుడూ రావటం, చూడటం, పోవటం, తాము అంగట్లో బొమ్మల్లా కూర్చోవటం సిగ్గనిపించిందా ముగ్గురమ్మాయిలకు. అది చాలక సాహూ నలభై నుండి ఎనభై వేల దాకా పెంచాడు కట్నం రేటును. ధరల పెరుగుదలతో పాటు కట్నాల రేటు కూడా పెరిగిందనే బాధతో, అలా ఇస్తేనన్నా చేసుకుంటారనే ఆశతో. 80 వేలిస్తా

నంటూ తిరిగినా ఫలించలేదు. అలా నిరాశా, నిస్సత్తువా, నిండిపోయాయి వారి మనస్సులలో.

పూనమ్‌కు విద్యా, ఉద్యోగార్హతా, అందం, సంస్కారం ఎన్ని వున్నా కట్నం చాలక లాంఛనాలకు మరో 50 వేలు కావాలంటూ వెళ్ళిపోయేవారు. ఈ పరిస్థితి పూనమ్‌నే కాక మిగిలిన ఇద్దరమ్మాయిలైన మమత, అల్కాలకు కూడా అవమాన మనిపించింది. వారు తమ దైన్యస్థితికి విసిగి, వేసారి తమలో తాము ఆత్మహత్యలకై నిర్ణయించుకున్నారు. తల్లిదండ్రులు, మిగిలిన పిల్లలూ లక్నోలో పెళ్ళికని వెళ్ళారు. ఆ రోజు భయంకర కాళరాత్రి అయింది వారిపాలిట. అదే రోజు, 1988 ఫిబ్రవరి 3న, ఆ ముగ్గురమ్మాయిలు చావే తమ సమస్యకు పరిష్కారమని ఈ భయంకర ఆత్మహత్యల వల్లనైనా ఈ వరకట్న పిశాచి సర్వ నాశనమవుతుందనే ఆశతో ఈ అఘాయిత్యానికి పాల్పడ్డారు. ఒకరు ఫ్యానుకు, మిగిలిన ఇద్దరూ కొక్కీలకూ ఉరివేసుకుని ముగ్గురూ హతమారిపొయ్యారు. సజీవ సమాధి అయ్యారు. నిండు ప్రాణాలను వరకట్న పిశాచికి బలి చేశారు. తమ ఈ చర్యకు, నిర్ణయానికి తమను క్షమించమని మిగతా వారిని బాధ పడవద్దని వుత్తరాలు రాసిపెట్టారు. అంతటితో ఆ కుటుంబ కథ ముగిసింది.

ఈ ఆత్మహత్యల వల్ల ఎవరికి లాభం? ఏం జరుగుతుంది? నష్టపడ్డదెవరు? సమాజంలో మార్పు వస్తుందా? అని ఆ అమాయకపు అబలలు ఆలోచించి వుండరు. అసలు చావే సమస్యకు పరిష్కార మార్గం అనే ఆలోచనే శుద్ధతప్పు. చావులతో సమస్యలు సమసి పోతాయను కోవటం భ్రమ; అవివేకం కూడాను. మనం పుట్టింది జీవించటానికి. అంతేకాదు, సుఖమయ జీవితాన్ని గడపటానికి. జీవచ్ఛవాల్లా జీవించటానికి కానే కాదు. సమస్యలను సవ్యంగా పరిష్కరించటంలోనే మనం మనమేధస్సుకు పదును పెట్టాలి. ఆలోచించాలి. నేర్పుతో, ఓర్పుతో. దూరదృష్టితో ఇబ్బందులను తొలగించుకోవాలి. ధైర్యం, ముందుచూపుల లేమి వల్లే ఇలాంటి దుస్సంఘటనలపాలు అవుతున్నారు అల్ప మనస్కులు. ఇది సందేశమూ కాదు; పరిష్కారమూ కాదు.

ఈనాటి సమాజం శరవేగంతో మారిపోతోంది. ఇది విలువల విప్లవమా అన్నట్లు విలువలు మారిపోతున్నాయి. శాస్త్రజ్ఞానం ఎంతో పెరిగింది. సామాజిక స్పృహ పెరిగింది. జీవిత విధానమే మారిపోతున్న ఈ తరుణంలో ఈ ఆత్మహత్యలేమిటి? ఈ దుస్సంఘటనలో మరో ముఖ్య విషయం ఇమిడి ఉంది. బొత్తిగా విద్యలేనివారు, అనాగరికులు, అజ్ఞానులు అయిన వారు మాత్రమే, పిరికిపందలు మాత్రమే సమస్యలకు తట్టు

కోలేక చస్తారు, లేక చంపుతారు ఏ మాత్రం ఇంగితజ్ఞానమున్నా, ప్రపంచాన్ని అర్థం చేసుకున్నా ఇలాంటి తొందరపాటు పనులు చేయరు. మన నడకతీరు సమాజానికి అద్దం పట్టినట్లు వుండాలి; ఆదర్శవంతమై వుండాలి. ఇతరులకు ఉదాహరణగా వుండాలి. ఆ మహాతల్లి చూడూ అనిపించేలా మరొకరికి గుణపాఠం కావాలి. సమాజానికి ఆచర యోగ్యం కావాలి. మన ప్రతి చర్య మరొకరికి ఆధారమై వారికి మార్గదర్శకత్వం వహించాలి.

ఇప్పుడీ ఆత్మహత్యల వల్ల వారి కుటుంబానినే కాక తోటి కన్యలకు కూడా నష్టదాయకమని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఈనాడు ఇంటింటా కన్యలున్నారు. కన్య కన్యకూ కట్నం చెల్లించాల్సిన గతి పట్టింది. మరి ఈ గ్రహణాన్ని నిర్మూలించాలంటే మనమంతా కలిసి సంఘాలు పెట్టి, "కట్నం ఇవ్వం" అని తీర్మానించి ఆచరిద్దాం. ప్రచారం చేద్దాం. అవసరమొస్తే కన్యలుగా జీవిద్దాం. అసలు పెళ్ళికోసమే మనం పుట్ట లేదు. ఇంకెన్నో ఘనకార్యాలు మనం సాధించవచ్చు. అన్నింటికన్నా వివాహం ముఖ్య మైనదయినా అదే పరమధ్యేయం కాదు. అసలు మనం కన్యలుగానే మిగిలిపోతామంటే వాళ్ళే మనముందు నిలిచి అర్థిస్తారు. వారికి మాత్రం కోరికలుండవా? పెళ్ళి, కుటుంబ వ్యవస్థా అక్కర్లేదా?

చచ్చిపోవటం పిరికితనం మాత్రమే. మనం ఎంతగానో ప్రేమించిన ఆత్మీయులు చనిపోతే మనం చస్తున్నామా? మనం తిరిగి బ్రతికి మన జీవితాన్ని సార్థకం చేసు కుంటున్నామా లేదా! అలాగే ఎన్ని కష్టనష్టాలొచ్చినా, మరెన్ని ఇక్కట్లు సంభవిం చినా ధైర్యంతో నిలబడగలగాలి. ఆ సంఘటనను లేక సమస్యను ఎవరికీ నష్టం కలు గని రీతిలో, న్యాయంగా, ధర్మసమ్మతంగా పరిష్కరించగలగాలి. నా దగ్గరికి రోజూ భర్తల వల్ల బాధపడేవాళ్ళెందరో వస్తూ వుంటారు. వాళ్ళ చరిత్రలు వింటూవుంటే చాలా హృదయ విదారకంగా వుంటాయి. చస్తామంటూ వచ్చిన వారే "చచ్చిపోం, హాయిగా బ్రతుకుబాటను తీర్చిదిద్దుకుంటాం" అంటూ గంపెడు దుఃఖాన్ని దిగమ్రింగి యెనలేని ధైర్యోత్సాహాలతో వెళ్ళిపోతూవుంటారు. అంతకంటే వరకట్న సమస్యే ఘోరమైనది కాదు. అంటే పెళ్ళయ్యాక, బిడ్డలు పుట్టాక భర్తల హింసలు భరించలేని వారి బాధలు వర్ణనాతీతం. అటు పిల్లలు, ఇటు భర్త, ఇటు సమాజం అన్నీ ఆమెను హతమారుస్తాయి. అదొక విషమ ఘట్టం. ఆమె జీవితం అస్తవ్యస్థమై పోతుంది. అలాంటి భార్యలే బ్రతుకుతుంటే, ఇక కన్యలుగా జీవించటం అంతకంటే దుర్భరమని నేననుకోను, అంతా మన మనస్సు పైనా, మన ఆలోచనలపైన ఆధారపడివుంటుంధి.

సమాజానికెందుకింత భయపడతారో అర్థం కాదు. అంటే అందర్నీ కన్యలుగా జీవించమని కాదు. అవసరమొస్తే అలాంటి నిర్ణయాలు చెయ్యాలి; ఆచరించాలి అంతే. 'కబడ్దార్' అంటేచాలు మన మగవారు ఆలోచిస్తారు. భయపడతారు. లేదా మనమే చూద్దాం.

ఇంతకూ చదువెందుకు? విజ్ఞానానికీ, వికాసానికీ, ఆలోచనకే కదా! ముగ్గురమ్మాయిలూ ఆస్త ఆలోచిస్తే బాగుండేది. ఉద్యోగాలు చేసుకొని బ్రతికేవాళ్ళు, వారికి నచ్చినవాడు, వారిని మెచ్చినవాడూ రాకపోడు. వస్తే పెళ్ళి, లేకుంటే బ్రతుకుతెరువుతో బ్రతుకుతూ ఇంత సమాజసేవ చేయవచ్చుగదా! తమబోటి బాధితులకు ఇంత సహాయం చేయవచ్చుగదా! ఎందుకీ తొందరపాటు? కాకపోయినా వారి మరణాలవల్ల వరకట్నం పోతుందా? ఇన్ని చట్టాలు, ఇంత అలజడి జరుగుతుంటేనే సమసిపోని ఈ జాఢ్యం వీరి చావులతో మారుతుందా? మరి కాస్త ఆలోచిస్తారా?

# అమ్మాయిల హత్యలు: ఆత్మ హత్యలు

వధువు + కట్నం = వరుడు అనడం నేరమా? వరవిక్రయం, నరవిక్రయం జంతుదశ వారసత్వం కాదా? ఆడపిల్లను కన్న నేరానికి తండ్రికి వేసే జరిమానా కట్నం అంటే తప్పా? క్రొత్త కోడలు మళ్ళీ కట్నం తెస్తుందని ఉన్న కోడల్ని చంపడం మోసం కాదంటారా? తెచ్చిన కట్నం చాలదని, ఇస్తానన్న 'ప్రెజెంట్సు' ఇవ్వలేదని అదనంగా ఆస్తులు ముట్టచెప్పలేదని, అమ్మాయిలను హత్యచేయడం పాపం కాదంటారా? కట్నంకోసం ప్రేమికుల్ని విడదీయడం, హింసించడం రాక్షసత్వం కాదా? స్త్రీని డబ్బుతో ఖరీదుచేస్తే అది వ్యభిచారం అన్నప్పుడు కట్నంపోసి పెళ్ళి పేరుతో పురుష సాంగత్యం కోరితే అది పవిత్ర బంధం అనడం అర్ధరహితం కాదనగలమా? కేవలం కట్నంకోసం కన్యల్ని బలి చెయ్యమని ఏ ధర్మ శాస్త్రం నిర్వచించిందో చెప్పగలరా?

మనం కొనుక్కున్న వస్తువుపై అధికారం లేకపోగా మనమే బలిపశువులం కావటం హాస్యాస్పదం కాదా! దాన్ని ద్వంద్వనీతి అంటే అలా చూస్తారేం? అర్థం కాకనా ఇష్టం లేకనా? అమ్మాయిల్ని చంపడమంటే అంత తేలికా? నిండుజీవితాలను అలా బుగ్గిపాలు చేయడానికి మీ బుద్ధులు మొద్దుపారి పొయ్యాయా? మీ మెదడుకు, మీ మేధస్సుకూ కేన్సరువచ్చి అవి చచ్చుబడి పోయాయా? ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మ నిలువునా సజీవ దహనమై పోతుంటే ఆ దృశ్యాన్ని ఎలా చూస్తారు? దృష్టిహీనత మిమ్మల్ని ఆవహించిందా? ఆ ఆర్తనాదాలు వినడానికి మీ చెవులకు చెదలు పట్టాయా?

"హత్యలు, ఆత్మహత్యలు;" "హత్యలూ ఆత్మ-హత్యలూ" అంటూ తెల్లారేసరికి ఏమూలో ఏ ఆడపడుచో చావని రోజులేదు. 99 శాతం పైగా వరకట్నపు హత్యలే. వాటిని ఆత్మహత్యలుగా చిత్రించటానికి చాలా మార్గాలు వున్నాయి. అందుకు తగిన సహాయ సహకారాలు అందించే పెద్దలూ వున్నారు.

చదువు, సంస్కారం, అందచందాలు గల కన్యలెందరో తమపై జరిగే అత్యాచారాలు సహించలేక, దుష్టుల క్రౌర్యాన్ని తట్టుకోలేక నిస్సహాయ స్థితిలో ఆత్మహత్యల రక్కసికి ఆహుతికి అవుతున్నారు. హత్యల అమానుషత్వానికి యెరయైన సాక్ష్యాధారాలు లేక ఆత్మహత్యలుగా చిత్రించబడే కేసుల సంఖ్య లెక్కకు మిక్కుటంగా వుంటున్నాయి. ఇలా మనం మన అమ్మాయిల్ని చంపుకుందామా? ఏదైనా మార్గాన్ని ఆలోచిద్దామా అనేది ఈనాడు మన ముందు మండుతున్న సమస్య.

స్త్రీకి ఆస్తిహక్కు ఇస్తే ఈ దురాచారం పోతుందని, చట్టాల ద్వారా శిక్షలు, జరిమానాలు పెంచితే భయపడతారనే అలజడి ప్రబలంగా వినపడుతోంది. ఆ భావంతోనే 1956 నాటి హిందూ వారసత్వ చట్టాన్ని సవరిస్తూ మనకొక క్రొత్తబిల్లు పాసయింది. అనతి కాలంలో చట్టం కాబోతున్నది. అయిలా కట్నం అనేపేరు మారి దాని ఛాయల రూపంలో ఆ చట్టం మరో మార్గాన పయనిస్తుంది. ఇప్పుడు కట్నం విలువైతే అప్పుడు అమ్మాయిల ఆస్తి విలువను తేల్చి అడుగుతారు. కనుక అది ఆర్థిక సమస్య కానేకాదు. అసమానత్వమే దీనికి మూలం. స్త్రీ ఆధారపడి బ్రతుకుతుందని, జీవితాంతం ఆమెను భర్త పోషించాలని, స్త్రీ పుట్టుకే తక్కువని, వివాహమే ఆమె జీవిత ధ్యేయమని ఇలాంటి 'ఎలిగేషన్స్' చాలా వున్నాయి.

వరకట్న నిషేధపుచట్టం 1961లో పుట్టింది. నమోదైన కేసు ఈనాటికి ఒక్కటి మాత్రమే. 1984 ఆగస్టులో ఆ చట్టాన్ని సవరిస్తూ శిక్షాకాలాన్ని పెంచుతూ, లాంఛనాలకు పరిమితి విధిస్తూ ఒక బిల్లు పెట్టారు. పూర్వం ఆరునెలల శిక్షవుంటే ఇప్పుడు రెండు సం॥ వరకు శిక్షాకాలాన్ని పెంచారు. పదివేలు లేక కట్నం మొత్తం అంటే ఏది ఎక్కువైతే దాన్ని మించకుండా జరిమానా విధించారు.

అసలు ఏ తండ్రి ఇచ్చానంటాడు? ఏ మామ పుచ్చుకున్నానంటాడు? రహస్యంగా ఇచ్చి పుచ్చుకునేదాన్ని ఎలా రుజువు చేస్తాం. అందువల్ల ఈ చట్టం పూర్తిగా విఫలమయి చట్టాలకు కట్నాలు పోవని నిరూపించింది.

ఇది ప్రస్తుత ప్రజా సమస్యగా, ముఖ్యంగా మహిళలు చేపట్టాల్సిన చిక్కు సమస్యగా తయారు అయింది. కొన్ని నిర్ణీత లక్ష్యాలతో, కొందరి సహాయ సహకారాలతో జరగాల్సిన పని. ప్రభుత్వం, ప్రజలూ, పోలీసులు, సేవా సంస్థలు, మహిళా సంఘాల లాంటి పాత్రలన్నీ కలిసికట్టుగా పనిచేయాలి.

వరకట్నపు చావు లేక అత్త మామలు, భర్తలు పెట్టే బాధలు భరించలేక స్త్రీ ఆత్మహత్య చేసుకున్నా, లేక వారు చంపినా దాని విషయాల్లో సరైన విచారణ జరుగుతుంది అనే భావం ప్రజల్లో కలిగించాలి. దాని కవసరమయిన చర్యలు తీసుకోవాలి. ఈ కేసులలో స్వయంగా దర్యాప్తు చేయటానికి డిప్యూటి సూపరింటెండెంటు హోదాకల స్త్రీ పోలీసు ఆఫీసరుకు మాత్రమే అధికారం ఇవ్వాలి. పెద్ద నగరాలలో, జిల్లాలలో ఈ కేసుల దర్యాప్తుకు ప్రత్యేక పోలీసు విభాగపు సెల్ ఒకటి వుండాలి. ఇటువంటి కేసులలో ఆసక్తిచూపే మహిళా సంఘాలను ప్రభుత్వం ప్రత్యేకంగా రిజిస్టరు చేయాలి. ఆ పట్టిక ఆయా పోలీసు అధికారుల వద్ద వుండాలి.

పోలీసు అధికారి శవ పంచాయితీ చేసేటప్పుడు ఆ మహిళా సంఘ సమక్షంలో జరపాలి. ఆ సభ్యురాలు పంచాయితీ దార్లలో ఒకరుగా ఉండాలి. ఆ ప్రతినిధి లేనిచో అందుకు కారణం ఆ అధికారి వ్రాతపూర్వకంగా పేర్కొనాలి.

పోస్టుమార్టం చేసే డాక్టర్ యొక్క ప్రాథమిక నివేదిక పరీక్ష అయిన వెంటనే పోలీసు ఆఫీసరుకు ఒక ప్రతి, మహిళాసంఘ ప్రతినిధికి ఒక ప్రతిని ఇవ్వాలి. రసాయనిక నివేదిక చేసేవరకు డాక్టరు శవపరీక్ష ప్రాథమిక నివేదికను ఇవ్వకుండా వుంటే డాక్టర్లు కేసును తారుమారు చేసే ప్రమాదం రావచ్చు.

కేసుల దర్యాప్తు వివరాలు సాధ్యమయినంత వరకు, నిందితుడు పరారీ అయిన ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప, ప్రజలకు, పత్రికలకు వెంటనే తెలియజేస్తూ వుండాలి చార్జిషీటు దాఖలు ఆలస్యమైతే నేరస్తుడు పరారయ్యే ప్రమాదం వుందని గమనించి వెంటనే చేయాలి.

పోయిన మనిషిని బ్రతికించలేము కదా అనే భావంతో కేసును సర్దివేయటానికి గాని, దర్యాప్తు పని తగ్గించుకోటానికి, నేరస్తుడిని శిక్షించటంలో గాని పోలీసులు నిర్లిప్తత చూపరాదు.

తాము చూచిన వాటిని, విన్నవాటిని అధికారులకు చెప్పటానికి ప్రజలు సందేహించడం, జంకటం, భయపడటం నేరంగా భావించాలి. సంకోచిస్తే కేసులో నిజానిజాలు బైటికి రావు. నిందితుడు రక్షింపబడతాడు. మళ్ళీ మళ్ళీ హత్యలు చేస్తాడు. వీణ్ణిచూచి ఇంకా కొందరు ముందుకొస్తారు.

ముఖ్యమైనది సాంఘిక బహిష్కరణ. కట్నం వున్న పెళ్లిళ్ళకు మనం పోరాదు. తీసికోని పెళ్లికి మనం వెళ్లి వారిని అభినందించి రావాలి. ప్రతితల్లి దండ్రులు పెద్ద డిగ్రీల వారికై ఎగబడితే వాళ్ళు చెట్టెక్కి వీళ్ళని అధిక కట్నం డిమాండు చేస్తూ వుంటారు. యోగ్యుడు, సంస్కారి అయినవాణ్ణి చూసి పెళ్లి చేయాలి. కట్నానికి ఇచ్చే డబ్బును అమ్మాయి విద్యకు ముఖ్యంగా వృత్తి విద్యలకు వెచ్చించాలి వరకట్న దుర్నీతని విమర్శించే పాఠ్యాంశాలను స్కూళ్ళ సిలబస్‌లలో చేర్పించి విద్యార్థులలో స్ఫూర్తిని కలిగించాలి. స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరమనే అపోహను తొలగించాలి. తగిన భర్త స్త్రీకి ఎంత అవసరమో తగిన భార్య తనకూ అంతే అవసరమనే భావాన్ని కలిగించాలి.

తుచ్ఛమైన డబ్బుకు అమ్ముడుపోమని యువజన సంఘాలు ప్రతిజ్ఞ పూనాలి. మా జీవిత భాగస్వామిని డబ్బుతో ఖరీదు చేయమని, అంతగా అవసరమొస్తే కన్యలు

గానే జీవిస్తామనే పట్టుదలతో విద్యార్థినులు. యువతులు సభలలో ప్రతిపాదనలు చేయాలి. ముఖ్యంగా మహిళలు, స్వచ్ఛంద సంస్థలూ ఈ బాధ్యతను నెత్తిన వేసుకోవాలి. పోలీసులు కేసులు పెట్టినా కేసుల దర్యాప్తు, నిర్వహణ, దాఖలు, లాంటివన్నీ మహిళా సంఘాలు నిర్వహించాలని 1973లో స్టేటస్ కమిటీవారు సిఫారసు చేసారు. అందువల్ల ఏ స్త్రీలైతే కష్టనష్టాలపాలు అవుతున్నారో, ఏ మహిళలైతే, హీనాతీహీనంగా చూడబడుతున్నారో, ఏ యువతులైతే దుర్భర మరణాల పాలవుతున్నారో, వారే సారథ్యం వహించక తప్పదు. ఈ భారాన్ని కేవలం పోలీసులపైన, ప్రభుత్వం పైన, డాక్టర్లమీద పెట్టినంత మాత్రాన అందులో న్యాయం జరగదు. కనుక మహిళలం మనమే పూనుకోవాలి. స్త్రీలంతా ఏకం కావాలి. ఐక్యతతో మహోద్యమాన్ని నిర్వహిస్తేనే వరకట్న పిశాచి పారిపోయేది.

ఏది ఏమైనా, ఎన్ని ఇబ్బందులొచ్చినా ఎవరెన్ని హింసలు పెట్టినా స్త్రీలు ఆత్మహత్య ప్రయత్నం ఎంతమాత్రం చేయరాదు. చచ్చి సాధించేది ఏదీలేదు. బ్రతికి వుంటే ఎన్నో ఘనకార్యాలు చేయవచ్చు. భర్త, అత్తమామలు చంపుతారనే అనుమానం రాగానే ముందు జాగ్రత్త పడాలి. హత్యకు కుట్ర పన్నుతున్నారని, ఆ ప్రమాదం రావచ్చుననే భావం రాగానే ఆ భర్తను, ఆ కాపురాన్ని, (పిల్లలున్నాసరే) వదులుకోవాలి. పోయిన ప్రాణాన్ని ఎంతటి ఆప్తులైనా రక్షించలేరు. బైటికి రావడం కష్టమే. కాని కష్టమైన కార్యాలకు పూనుకోకపోతే దుర్మార్గాలను అరికట్టలేము కదా! మరి మనందరం ఏకమై ఈ వరవిక్రయ దుర్నీతిని, అమ్మాయిల హత్యలను, ఆత్మహత్యలను పోరాటాల ద్వారా అరికట్టక తప్పదు.

# అత్తల వ్యథ : కోడళ్ళ బాధ

సావిత్రమ్మగారు బహు దొడ్డ ఇల్లాలు. ఉన్నంతలో ఆమె ఎవరికీ లేదనలేదు. ఇరుగు పొరుగు, బీదా సాదా అంతా ఆమె సహాయాన్ని అర్థించి సంతోషంతో దానిని పొందేవారు. ఆమెకు ఊరి నిండా మామంచి పేరు. ఆమె మనస్సు వెన్న లాంటిది. గ్రామంలో ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆమె ప్రత్యక్షమై ఆదుకొనేది. ఆమె తన ఒక్కగా నొక్క కుమారునికి అనువైన అమ్మాయిని చూచి కోడలుగా తెచ్చుకొంది. కట్న కానుకలు ఆశించనే లేదు సరికదా, వివాహ ఖర్చులు కూడా సింపిల్‌గా పెట్టించింది. ఇంత మంచి అత్తగారు లభించి నందుకు కమల మురిసిపోయేది. కాని కాపురానికొచ్చిన నెల కల్లా అత్తగారి వైఖరిలో మార్పును చూడ గల్గింది. ఆ బాధవల్ల కమల అయోమయంలో పడిపోయి, భర్తతో సంప్రతిద్దామనుకుంటే ఆమెలో భయం, సంకోచం వుండేవి. చివరకు తెగించి అతగాడిని అడిగితే పెద్దలను గౌరవించి మసలుకోవడం నేర్చుకోమని హితవు చెప్పాడు. అప్పుడే హంగామాకు దిగావా అని విసురుకుంటూ వెళ్లిపోయాడు.

ఈ పరిస్థితికి ఎవరు కారణ భూతులు? తప్పెవరిది? ఈ స్థితిలో నుండి బయట పడేది ఎలాగు? కావాలని తెచ్చుకున్న కోడలిపై అత్త ఎందుకు కారాలు, మిరియాలు నూరుతున్నది? ఊరందరికీ మంచిగా ఉన్న సావిత్రమ్మ కోడలుపై ఎందుకు చీటికి మాటికి విసుక్కుంటున్నది? మర్యాదస్తుడు, శాంతమూర్తి అని పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న సావిత్రమ్మ కుమారుడు భార్యను ఎందుకు కోప్పడు తున్నాడు?

ఈ ప్రశ్నలు వినగానే పురుషాధిపత్యాన్ని బహిరంగంగా, లేక అన్యాపదేశంగా వాంచించే పురుష పుంగవులు రంగంలోకి వస్తారు. మేము చెప్పలేదా "స్త్రీకి స్త్రీయే శత్రువు!" అని అంటూ నగర్వంగా పలుకుతారు. కమల భర్త నడవడికి సావిత్రమ్మదే బాధ్యత అయినట్లు చెప్పారు. సావిత్రమ్మదే తప్పు అయితే కొడుకు న్యాయదృష్టి ఏమయినట్లు? అతగాడి స్వతంత్రత ఎక్కడికి పోయినట్లు? అతడి తెలివితేటలు, వివేచన ఏ గంగలో కలిసి పోయినట్లు? ఈ లోపాలకు సావిత్రమ్మదే బాధ్యతా? కమల భర్త ఎందుకు అంత వాజమ్మ అయి పోయాడు?

పరిస్థితి సాకల్యంగా విశ్లేషణచేస్తే తప్పు అసలు సమస్య అవగాహన కాదు. ఎవరి పైననో ఒక నిందవేసి అంతటితో తమ పని పూర్తి అయినట్లు భావించే ఇరుగు

పౌరుగూ-స్త్రీ పురుషులూ—పిన్నలూ పెద్దలూ బాధ్యతను నెరవేర్చినట్లు తృప్తిగా నిట్టూర్పులు విడవడం అసంబద్ధం; అసంగతం.

మన దేశంలో పెక్కు కుటుంబాల పరిస్థితి గమనిస్తే సమస్య అవగాహన అవుతుంది. అనేక కుటుంబాలలో స్త్రీకి గృహిణిపాత్ర సంప్రదాయంగా వస్తుంది. ఇంట బయట వ్యవహారాల్లో ఆమెకు ప్రమేయం లేదు. ఆ అంశాల ప్రసక్తి వచ్చినపుడు ఆమె తన జీవిత భాగస్వామికి అండగా నిలబడలేదు. సలహా చెప్పలేదు; ఆచరించి మార్గదర్శకత్వం వహించలేదు. కారణం ఒకటే ఒకటి. ఇంటి బయట ప్రపంచం ఆమెకు తెలియదు. ఆమెకు ఆ విషయాలు అనుభవైక వేద్యాలు కావు. అందువల్ల ఆమె తన దృష్టిని తాన సంతానం మీద సారిస్తుంది. పురుష ప్రాధాన్యతకల సమాజంలో పురుష సంతానాన్ని అందరూ ఆదరిస్తారు. ఆమె కూడా అలాగే చేస్తుంది. కుమారుడు ఆమె ఆస్తి, ఆమె సర్వస్వం. ఆమె ప్రేమకు పాత్రమయిన కుమారుడు సుఖపడాలని ఆమె ఆశించటంలో ఆశ్చర్యం లేదు. అందుకే కుమారులకు పెళ్లి చేస్తారు తల్లులు, కాని తీరా కుమారుడు ఇంకొక స్త్రీ మనిషి అయిపోతే ఆ తల్లి భరించలేదు. పెండ్లి కాకముందు కుమారుని ప్రేమనంతా తల్లి చూరకుంటుంది. కోడలు వచ్చాక, కొడుకు ప్రేమను కోడలు కూడా ఆశిస్తుంది. అంటే అతని అభిమానంలో మూడు పాళ్ళు భార్యకు ఒక పాలు తల్లికి చెందుతుంది. పించను పుచ్చుకున్న ఉద్యోగిలాగా ఆ తల్లి గిలగిలా కొట్టుకుంటుంది. నిండుజీవితంపోయి పింఛను పేరుతో కొద్ది జీవితాన్ని పొందే ఆ ఉద్యోగిలాగా తల్లికూడా కుమారుని కొరత ప్రేమను స్వీకరించ లేక పోతున్నది. ఇది ఈ పరిస్థితిలోని అంతర్గత వైరుధ్యమే కాని మరేమీ కాదు.

ఇక కుమారుని విషయం అతడు అందరి పురుషుల లాగానే తల్లిచాటుబిడ్డ. జీవితానుభవాన్ని చూరకొనక ముందే, మానసికంగా పరిపక్వతను సాధించుకోకముందే వైవాహిక జీవితంలో అడుగు పెడ్తున్నాడు భారతీయ పురుషుడు 'మాతృదేవోభవ' అనే సూక్తిని ఉగ్గు పాలతో నేర్చుకున్న పురుషుడు తన కులాన్ని, రాష్ట్రాన్ని, దేశాన్ని తల్లిగా చూస్తాడు. అందువలననే అతడు అస్వతంత్రుడుగా జీవితం సాగిస్తాడు. భార్య మానసిక బాధను నిండుమనస్సుతో అర్థం చేసుకోలేని దుస్థితి అతనిది.

ఇక క్రొత్త కోడలు స్థితిని గురించి ఆలోచిద్దాము. 18, లేక 20 ఏళ్లు పెరిగిన పుట్టింటిని వదలి అత్తింటికి ఆమె తరలి వస్తుంది. క్రొత్త మాగాణి భూమిలో నాటిన మొక్క లాంటిది. ఆమె పరిస్థితి. అందరూ క్రొత్తవారే. చివరకు భర్త కూడా. కాగా

వివాహం అనే బంధంతో తనను అతనితో కట్టివేశారు కదా! కనుక అతనిని పెనవేసు కుంటుంది. అతడు తప్ప మరొకరు ఆమెకు ఆలంబనం లేదు. పుట్టింటి ఆదరాభిమానా లను ఒక్కసారి కోల్పోయి శూన్యదశ నుండి కొంతయినా భర్త అనురాగాన్ని పొందా లని చూస్తుంది. ఆమె ఆది న్యాయమే కదా! అయితే భర్త ప్రేమ అంతా పెళ్లి కాక ముందు అతని తల్లిదే. ఇపుడు కనీసం సగం పైగా అత్తగారు కోల్పోతుంది. ఇదీ ఈ పరిస్థితిలోని అంతర్యం. అత్తకు కుమారుని ప్రేమ కొంత పోతుంది, దాంతో ఆమెకు మానసికవ్యథ. నా అనేవారు—భర్తతప్ప-ఎవరూ లేక భర్తను చుట్టేసుకుంటే తప్ప గతిలేని స్థితిలో కోడలు ఉంటే ఆమెను కుమారుని ప్రేమను పోగొట్టుకున్న తల్లి ఈస డిస్తుంది. దాంతో కోడలు మానసిక బాధకు లోనవుతుంది. ఇదంతా సహజమే. కాని సహజమని మనం ఎండను భరించలేము, వానలో తడవలేము. అలాగే పరిస్థితిని విజ్ఞ తతో, వివేచనతో, సహృదయంతో, సానుభూతితో, అత్తా కోడళ్ళు అర్థం చేసుకుంటే పరిష్కారం దొరుకుతుంది. కుమారుని సుఖం కోరేతల్లి త్యాగం చెయ్యాలి. తన సుఖాన్ని భర్త ఆనందాన్ని కోరే కోడలు అత్త పరిస్థితిని గమనించి ఆమెను ఆదరిం చాలి. కుమారుని ప్రేమ సగం కోల్పోయినా, కోడలు రూపంలో కుమార్తెను చూచుకొని ఆమె ఆదరాభిమానాలను చూరగొని తను పోగొట్టుకున్న ప్రేమను అత్త భర్తీ చేసు చేసుకోవాలి. అప్పుదే సంఘర్షణలు లేకుండా వైరుధ్యం నశిస్తుంది. పాపం! కుమారుడు కూడా ఈ సంకట స్థితినుండి బ్రతికి బయట పడతాడు. మరికాస్తంత ఓపికతో నిశి తంగా ఆలోచిస్తారా?

# ఆడది వంటకు, ఇంటిపనికే పుట్టిందా ?

"వండ నలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్దియౌ సతని గృహిణి అతిథు లేతేర నడికి రేయైన" అనేది స్త్రీ ధర్మమని, అది స్త్రీల పాలిటి వరమని, ఆమే ఆదర్శ గృహిణి అని ఆరాధిస్తూ మెచ్చుకొనే పిచ్చి సమాజం మనది. ఇది తరతరాల భావ సంప్రదాయం. ఎంత రుచిగా వండితే, ఎంత మందికి వండి వారిస్తే అంత గౌరవిస్తారా యిల్లాలిని. ఆహా ఏమి వంట! ఏమి రుచి! అమృత హస్తం నీది. షడ్రసోపేతంగా తినిపిస్తున్నావు. అంటూ మాటలతో ఉబ్బిస్తూ మృష్టాన్నాన్ని భుజించటం మగవారికే చెల్లుతుంది. ఆమాటలకు ఉబ్బితబ్బిబ్బై ఇంకా ఇంకా ఊడిగం చెయ్యటం ఆడవారికే చెల్లుతోంది. ఆడది వంట కోసమే పుట్టిందనే భావం స్త్రీ పురుషులిద్దరిలోనూ గాఢంగా పాతుకుపోయింది. ఉద్యోగం పురుషలక్షణమని, వంట స్త్రీ లక్షణమనే సామెత ఉండనే వుంది. అంతేకాదు. ఆడదాని మొహాన వంట, వంట, వంట అని బ్రాశారని వల్లెవేస్తూ ఆనందిస్తారు మగవారు. ఆ సంప్రదాయాలు జీర్ణించు కున్న ఆడవారు సైతం అదేదో మహాప్రసాదమని, వరమని భావిస్తూ 8 ఏళ్ళ నుండి 80 ఏళ్ళదాకా ఆ మాట కొస్తే చచ్చేదాకా వంట చేస్తూనే వుంటారు. పూర్వం కనీసం మూడు రోజులన్నా విశ్రాంతి లభించేది. ఈనాడు దానికీ దూరమయ్యారు. ఏ బుద్ధిమంతుడైనా సాయం చేస్తుంటే అయ్యో! అయ్యో! అదేమిటలండీ మీరు వంట ఇంట్లోకి రావడం! నేనింకా బ్రతికే వున్నానండీ! ఎవరైనా చూస్తే నవ్విపోతారండీ! నన్ను నడిబజారు కెక్కించకండీ అంటూ దీర్ఘాలు తీస్తారు. అందువల్లే ఉద్యోగిని అయినా, ఆస్తులు తెచ్చినా వంట పని, ఇంటిపని ఆడదాని పరమయి పోయింది. ఇది దశాబ్దాలుగా, తరతరాలుగా నడుస్తున్న చరిత్ర.

అమ్మాయి వంటా వార్పు, పనిపాటలు బాగా చేస్తుందా? ఇది పెళ్ళి వారి ప్రశ్న. ఇది చాలక ఉద్యోగార్హత, ఆస్తి, అంతస్తు, కట్నకానుకలు కూడా చూస్తున్నారు ఈనాటి మొగుళ్ళు. అంటే ఆడది వండాలి, వార్చాలి, ఉద్యోగమూ చెయ్యాలి, మళ్ళీ ఆస్తి పాస్తులూ తేవాలన్నమాట. మరి మగవారికి షరా మామూలే. అంటే కేవలం 6 గంటలు పని చేసి హాయిగా, జల్సాగా బ్రతకవచ్చు. మళ్ళీ 55 ఏళ్ళకల్లా పూర్తి 'రెష్టు' అది చాలక ఆదివారాలు, పండగలు, సంవత్సర సెలవులూ, అనారోగ్య సెలవలూ, మరి స్త్రీలకు ఎడా తెరిపి లేని కార్యరంగం వంట. వంట రాని దాన్ని పట్టి పనికిమాలినదంటూ ఈసడిస్తారు. ఆడదాన్ని కూర్చోపెట్టి ఎవరు పెడతారు! పని ముద్దా ఆరోగ్యం

ముద్దా అని ఎద్దేవ చేస్తారు. అందువల్లే ధనవంతులైనా, బీదవారైనా మగపిల్లలకు విద్య నేర్పించి ఉద్యోగార్హుల్ని చేస్తారు. ఆడపిల్లలకు చదువు మాన్పించి ఇంటి పనులు నేర్పిస్తారు. పైగా చదువుకూ, కట్నానికి కూడా డబ్బు కుమ్మరించగలమా? అంటారు. కాక పోతే ధనవంతులు మాత్రం పెళ్ళిదాకా చదివిస్తున్నారు.

"నల భీమ పాకం అనే పొగడ్త మా కొచ్చిందా? మీ కొచ్చిందా ?వేల మందికి సంతర్పణలకు వార్చేది మేమా మీరా?" అంటూ ఎత్తిపొడిచే వర్గమొకటుంది. ఆ నల భీములే మళ్ళీ ఇంట్లో చస్తే చెయ్యరు. పేరూ, హోదా వరుమానం దక్కే చోట్ల మాత్రం చేస్తారు. 'ఇన్‌ఫీరియర్ వర్క్'అని, 'రొటీన్ వర్క్' అని, జిలుగుపని అని ఇంటి వంట నీచమైనదనే భావం వల్లనే భర్తలకు భార్యలకు సాయం చెయ్యరు. భరించేవాడు భర్త కనుక అధికారం, హోదా, పశుబలం, దర్పం గల పెత్తనాన్ని మాత్రం చెలాయిస్తాడు. పురుషుడు. భార్య కన్నా ఆదాయం, వనరులు, ఉద్యోగార్హత తక్కువ వున్నా అధి కారం మాత్రం భర్తలకే చెందుతోంది. ఆమె 4, 5 వేలు సంపాదిస్తే అతను వంట చేస్తాడా? ఎందుకు చెయ్యడు? ఆమె కన్నా చిన్న ఉద్యోగమైతే ఆమెను మాన్పిస్తాడు. భార్య కలెక్టరైతే ఆ ఆఫీసులో భర్త గుమాస్తా పని చేస్తాడా? కారణం-అన్ని రంగా లలో ఆమె రెండో స్థానంలో వుండాలనే ధ్యేయం భర్తలకు వుంది.

పురుషుడికి ఏనాడు ఆస్తిపై పెత్తనం వచ్చిందో స్త్రీని లొంగదీసి పనిపాటలు చేయించు కోటానికి అలవాటు పడ్డాడు. ఆమె ఎలాగూ బైటిపని చెయ్యదు కనుక ఇంటి పనిని (Division of Labour) పని విభజన పేరుతో బండ చాకిరి, గొడ్డు చాకిరి ఆమె నెత్తిన రుద్దటం జరిగింది. సామాజిక వుత్పత్తిలో పని చేసే చేతి పనుల స్త్రీలు, పొలాల్లో పనిచేసే కూలివాళ్ళు, చేనేత కార్మికులు, పరిశ్రమల్లో పనిచేసే స్త్రీలు, 70 శాతం వున్నారు. వీరంతా ఇంట్లో పని, బైటి పని రెండూ చేస్తూనే వున్నారు. ఇక ధన వంతుల భార్యలు, జమిందార్ల భార్యలు, అగ్రవర్ణాలనబడే వారి శ్రీమతులు, ఉద్యోగ స్తుల భార్యలు సంపాదించరు. కాని వీరు కూడా వంట, ఇంటి పని మాత్రం చెయ్యక తప్పటం లేదు. ఇక మధ్యతరగతి స్త్రీలు చాలా మంది ఏదో ఒక ఉద్యోగం చేస్తూనే వున్నారు. అది చాలక వంటపని అంతా వారే నిర్వహిస్తారు. అంతేకాదు బ్యాంకింగు, 'షాపింగు', రేషన్, పిల్లలకు 'టీచింగు' లాంటి పనుల భారంతో కృంగి కృశించి పోతున్నారు. 'వర్కింగు క్లాసు', మధ్యతరగతి మహిళలు రోజుకు 18 గంటలు పని చేస్తున్నారనేది నగ్న సత్యం.

అసలు పని విభజన ఎక్కడుంది ఇదంతా గారడీ తప్పు. ఇంతచేసినా స్త్రీకి గుర్తింపు లేదు. విలువ అంతకన్నా లేదు. ఆమెను (Parasite) అంటే పరాన్నభుక్కురాలు అని ఈసడిస్తున్నారు. అందుకే నైరోబి సభలలో స్త్రీ చేసే ఇంటి పనికి గుర్తింపు ఇవ్వాలని, లేక పోతే నెల జీతం ఇవ్వాలని తీర్మానించారు. దాని మీద గాలి దుమారం లేచింది. తన భర్తకు, తన పిల్లలకు చేసే సేవకు జీతమా! అని అవహేళన చేశారు. మరి సర్వ రంగాల్లో పని చేసే స్త్రీని నీచంగా చూడటం క్షమార్హం కాదని మహిళా దశాబ్దపు సభల సమీక్షలో హెచ్చరించారు. కనుక స్త్రీ ఎవరిమీదా ఆధారపడటం లేదని తేలింది. ఇంటి పనికి గుర్తింపు, విలువా వున్నాయని నిర్వచించడం జరిగింది. మరి 'లాజికల్'గా ఆలోచిస్తారా?

స్త్రీ పురుష సంబంధాన్ని బట్టి సమాజ స్వరూపాన్ని నిర్ధారణ చేయవచ్చు. అసమానత్వం విలయతాండవం చేస్తున్నదని చర్చించుకున్నాం. ఏది అభిలషనీయం అని ఆలోచించి నిర్ణయించాల్సిన అవసరం వచ్చింది: ఆడది తక్కువ మగాడు ఎక్కువగా వున్న ఏ సమాజమూ పురోగమించ లేదు. స్త్రీ పురుష వివక్షా సిద్ధాంతాన్ని స్త్రీల మీద రుద్ది వారిని లోబరచు కున్నారు. అజ్ఞానాంధకారంలో నిమగ్నులైన ఆడవారు ఈ మాటలు నమ్మి బోల్తా పడ్డారు. శ్రమ విభజన అన్యాయం, అక్రమం, మోసపూరితమని గ్రహించ లేక పొయ్యారు. కాలం, పరిస్థితులూ మారాయి, ఎన్నో అసాధ్యాలు ఈనాడు సాధ్యాలయ్యాయి. ఈ అణు యుగంలో కూడా ఆడదాన్ని వంట ఇంటికి నెట్టటం అన్యాయం, అర్థరహితం అమానుషం కూడాను. మేధస్సులో, ఉనికిలో, పుట్టుకలో, విద్యా ఉద్యోగాల్లో మేటి అనిపించుకుంటున్న అమ్మాయిని అబల అనడం ద్రోహమే కాదు నేరం కూడా. వారి శక్తి సామర్థ్యాలు వెలుగులోకి రానిచ్చి సమాజాభివృద్ధికి తోడ్పడాలంటే ఇంటి పని, వంట పనిలో భార్యాభర్తలిద్దరూ భాగస్వాములు కావాలి. పనిపాటల్లో, హక్కుల్లో హెచ్చుతగ్గులు నశించి ఇద్దరూ సమానంగా పాల్గొనడం అత్యవసరం అనకతప్పదు.

# ఇంటి చాకిరికి ఖరీదు కట్టే షరాబులెవ్వరు?

'తన కున్నపని తినకున్నా తప్ప'దన్నట్లు స్త్రీలు ఆ జన్మాంతం ఇంటిచాకిరీ చేస్తూనే వున్నారు. చీవాట్లు, తిట్లూ తింటూనే వున్నారు. "నీవు ఉత్పత్తి చేస్తున్నావా? ఊళ్ళేలు తున్నావా. మా సంపాదన తింటూ మాకు ఇంత కూడు పెట్టడానికి ఇన్ని సిద్ధాంతాలూ, రాద్ధాంతాలు ఎందుకో! ఆధారపడి బ్రతికే వాళ్ళు చచ్చినట్లు పడివుండాలి కాని హక్కులు, అధికారాలు కోరమని ఏ ధర్మశాస్త్రం నిర్వచించింది?" అంటూ అధిక్షేపిస్తారు 'పోషకులు'.

వెట్టిచాకిరి రెండురకాలుగా సాగుతోంది. భూస్వామ్య సమాజంలో జమీందార్లు, దొరలు, గ్రామ పెత్తందార్లు, నౌకర్లు, చేతివృత్తుల వారిచేత, ప్రజానీకం చేత ఉచితంగా చేయించుకునేది ఒకరకం. అలాకాక ఇంటెడుచాకిరి, పుట్టెడు పని చేసే గృహిణుల ప్రతిఫల రహితమైన కార్యకలాపం రెండవది. ఈ మాట అనగానే కొందరు సనాతన సంప్రదాయ వాదులకు గంగవెర్రు లెత్తుతాయి. ఇలాంటి ఆరోపణ భార్యాభర్తల మధ్యవుండే సుహృద్భావాన్ని, సామరస్యాన్ని నాశనం చేస్తాయని వారు వాదిస్తారు. సమస్యను క్షుణ్ణంగా ఆవేశకావేషాలకు అతీతంగా అధ్యయనం చేయవలసిన అవసరం చాలావుంది.

ఉద్యోగినులు ఇంటాబైటా చాకిరీ చేస్తూ కూడా తగిన గౌరవాన్ని, హోదాను, స్థాయిని పొందలేక పోతున్నామని బాధపడుతున్నారు. ఇక సాధారణ గృహిణుల విషయం మరీ అంధకార బంధురంగా వుంటోంది. క్షణం తీరికావుండదు ఏ గుర్తింపూ వుండదు. ఎవరి మన్ననలూ వుండవని విలవిల్లాడి పోతున్నారు. గృహిణులనుచూచి ఉద్యోగినులు, వీరిని చూసి వారు అసూయ పడుతున్నారని అనిపిస్తుంది.

ద్వితీయశ్రేణి మధ్యతరగతి కుటుంబాలలోను, శ్రామిక కుటుంబాలలోను గృహిణి ఇంట్లో అనేకవిధులను నిర్వర్తిస్తున్నది. ఇంట్లో ఆమెయే వంటగత్తె, పనికత్తె, చాకలి, దాసి తదితర గృహకృత్యాలన్నీ కూడా ఆమెచేస్తుంది. కాని విచిత్రమైన విషయమేమంటే ఇందరి పని ఒక్కత్తే చేసినా దానికి పారితోషికం ఉండదు. వేతనం అసలే వుండదు. అభినందనలకు నోచుకోదు పైగా ఈసడింపులు, ఛీత్కారాలు మాత్రమే ఆమెకు దక్కుతాయి. అత్తమామల దృష్టిలో భర్త దృష్టిలో ఆమెపనికి విలువ శూన్యం.

కాకపోతే ప్రాణాలతో జీవితం కొనసాగించడానికి మాత్రం కావలసిన ఆహారాన్ని, వస్త్రాలను, ఆశ్రయాన్ని మాత్రం కల్పిస్తాడు గృహయజమాని. ఆమె స్వీకరించే ఆహారం ఆ మాటకొస్తే ఆమెను తిననిచ్చే తిండి పోషకగుణరీత్యా అత్యల్పమని శాస్త్రకారులు ఘోషిస్తున్నారు. అందువల్లనే బాలింతమరణాలు, శిశుమరణాలు అధికంగా వుంటున్నాయి. ఇంత ఘోరం జరుగుతున్నా గృహిణుల చేత ఇంటిపని ఉచితంగా చేయించుకోవడం తమ జన్మహక్కుగా భావిస్తారు పురుషులు. ఇది తగదని స్త్రీలు పేచీ పెడితే అదేదో మహాపాప కార్యమని, నికృష్టచర్య అని భావిస్తున్నారు. పదేళ్ళనాడు ఇంటి పనికి వేతనాలు కావాలని నినాదాలిస్తూ వీధుల వెంట లండన్ మహానగర స్త్రీలు ప్రదర్శనచేస్తే ప్రపంచమంతా ఘోషించింది. వారిచ్చిన నినాదం, వారి పోలికేక సమంజసమైనా, కాకపోయినా సమస్యను ప్రజలదృష్టికి తెచ్చిన గౌరవం, వారికి దక్కింది.

కుటుంబానికి స్త్రీ చేస్తున్న శ్రమకు కాలనిర్ణయం లేనేలేదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడల్లాచేయాలి. ఎన్నిగంటలైనా ఆమె పనిచేస్తూనే వుండాలి. ఆమె అలసటతో ఇతర్లకు ప్రమేయంలేదు. నిస్సత్తువుగా వున్నా, వ్యాధిగ్రస్తురాలైనా వృద్ధురాలైనా, మానసిక అస్వస్తురాలైనా ఆమె పని ఆగడానికి వీలులేదు. ఆమెను సంజాయిషీ అడిగే హక్కు అందరికీ వుంది. అంటే అత్తమామలకు, భర్తకు, బిడ్డలకు కూడా ఆమె సంజాయిషి చెప్పుకోవాలి. పనిలో వీసమెత్తు వ్యత్యాసం వచ్చినా శూలాల్లాంటి మాటలతో ఆమె మనస్సును గాయపరుస్తారు. ఆమె ఎంతో శ్రమపడి రుచిగా వంటకాలు తయారు చేసినా, ఇంటిలో సామాన్లు అమర్చినా, ఇల్లు కళకళలాడేటట్లు చేసినా ఆమె నెవ్వరూ అభినందించరు. వారి దృష్టిలో అదంతా ఆమె విధి. బాధ్యతకూడాను. విధి నిర్వహణ చేస్తే మెప్పువుండదు, చేయకపోతే తప్పు. పైగా దండన కూడాను. ఆమెకు ఏ పరిస్థితుల్లోను సెలవు అనే మాట లేదు. వయస్సుమళ్ళినా అనారోగ్యంతో అలమటిస్తున్నా అశాంతితో ఆందోళనలో మునిగివున్నా విశ్రాంతి ఇమ్మని ఆమె కోరరాదు, ఆమె అడిగినా ఇచ్చేవారులేరు. ఇదే పనిని ఆమె ఇతర కుటుంబాలలో (వంటవగైరా) జీతానికి చేస్తే ఆమెకు చాలా సౌకర్యాలు వుంటాయి. కార్యాలయాల్లో పని చేస్తే సెలవులు, జీతం మీద సెలవులు, ఇంక్రిమెంట్లు, పింఛను లభిస్తాయి. అదీగాక వేతనం చాలా పెద్దయెత్తున ముడుతుంది. వీటికి నోచుకోక కండలు కరిగించుకుంటూ, కన్నీరు కారుస్తూ నోరుమెదపకుండా, లేని సంతోషాన్ని ముఖం మీద తాండవింపచేస్తూ ఆ యిల్లాలు

బండెడు ఇంటిచాకిరీ ఒక్కతే చేస్తూ అందరికీ అన్నీ అమరుస్తూ కాలం దొర్లించు కుంటుంది. ఈ శోచనీయ పరిస్థితి నుండి ఆమె బైటపడడానికి మార్గంలేదా అని ఆక్రోశిస్తున్నది.

ఇల్లాలు చేసేపనిని చేయడానికి-స్వల్పకాలం మాత్రమే పనిచేసే మనుషులను అంటే వంటమనిషిని, పనిమనిషిని, చాకలిని, బజారు పనులకు మరో మనిషిని, నియమిస్తే వారికి ఎంత వస్తుందో ఆ విలువను ఆమె శ్రమ విలువుగా పరిగణించ వచ్చును. కాని ఆ విలువలో వీసమెత్తుకూడా—తిండితిప్పలు కాక-ఆమెకు చేరటంలేదు. గతిలేక, విధిలేక, బ్రతిమాలితే పదో పరకో ఆమె ముఖాన విసిరివేస్తాడు ఆ గృహయజమాని అయిన భర్త. ఈ విషయాన్ని అలావుంచి భర్తపరంగా ఆలోచించినా అతడు ఆమె శ్రమకు తగిన మూల్యాన్ని చెల్లించలేడు. అతని సంపాదన దానికి చాలదు. ఇది ఒక విచిత్ర పరిస్థితి, ఇదొక దుర్భరమైన అవమానకరమైన పరిస్థితి. ఈ భయంకర పరిస్థితికి పరిష్కార మార్గమేది?

ఇతర దేశాలలో కుటుంబ జీవితంలో స్త్రీ లాంటి పాత్ర వహిస్తున్నదో, ఎలాంటి పరిస్థితుల్లో ఆమె శ్రమిస్తున్నదో తెలిసి కోవడం కొంత ఉపయుక్తం అవుతుంది. స్త్రీ పురుషులిద్దరూ ఇంటి వెలుపల కార్యాలయాల్లో ఫ్యాక్టరీలలో, ఇతరవ్యాపార పరిశ్రమల్లో సర్వసాధారణంగా ఉద్యోగాలు చేస్తుంటారు. ఇంచుమించుగా ఇద్దరికీ సమానవేతనం లభిస్తుంది. అభివృద్ధి చెందిన అమెరికాలాంటి పెట్టుబడిదారి దేశాలలో స్త్రీకి చాలావరకు సామాజిక స్వేచ్ఛ ఒనగూడింది. రాజకీయ, ఆర్థికరంగాలలో ఆమె ఇంకా ఎంతో వెనుకబడి వున్నా, సామాజిక రంగంలో ఆమె పురోగమనం గణనీయం. తత్ఫలితంగా ఇంటి పని భార్యా భర్తలిద్దరూ చేసుకోవడం, సంతానం కూడా సాయంచేయడమూ జరుగుతూ వున్నది. ఈ విధంగా చేస్తే బండెడు చాకిరితో ఇల్లాలు కృంగిపోయే స్థితి రాదు శారీరకంగా, మానసికంగా ఆమె ఆరోగ్యంగా వుంటుంది.

నీవు ఇంటా బైటా పని చేస్తున్నావు. అది నీవు నీవు సంతోషంగా త్యాగబుద్ధితో చేసేపని, చేయాల్సినపని. కనుక నీవుదానికి మూల్యంలేదా అని ప్రశ్నించడం న్యాయం కాదని భర్తలు తండ్రులు, మామలూ, అన్నదమ్ములూ, బిడ్డలూ అత్తలు అంటే యావత్ ప్రపంచమూ ఆమెను దోషిగా నిలబెట్టి ప్రశ్నిస్తుంది. అప్పటికే బండ చాకిరితో బ్రతుకు భారం భరించలేక సతమత మవుతున్న ఇల్లాలు పెల్లుబికిన దుఃఖానికి, క్రోధావేశానికి లోనవుతుంది. అప్పుడు ఆమెకు ధైర్యంవస్తుంది. 'నా సంతానానికి రక్షకులు మీరు. సంరక్షకులు మీరు. కుటుంబ యజమాని మీరు, మనిద్దరి సంపాదనమీద పెత్తనం

పీఁది. ఆస్తిపాస్తుల సంపాదన విషయంలో తుది నిర్ణయం మీది. నేనెంత సంపాదించినా చివరకు కొద్దిపాటి ఖర్చులకు కూడా నేను మిమ్మల్ని బిచ్చం కోరాల్సిన పరిస్థితి నాది. కుటుంబంలో సహకారం ఎక్కడవున్నది?' అని ఇల్లాలు ధీమాగా ఈనాడు ప్రశ్నిస్తోంది. పురుషుడు ఆమె వాదనా బలాన్నికాదన లేక, ఆ నిజాన్ని అంగీకరించలేక తడబడు తున్నాడు. తన పెత్తందారి తనం బీటలు బారుతుందని వణికిపోతున్నాడు. నిజానికి స్త్రీ పురుషుల మధ్య సమానత్వం లేని నాడు సహకారం అనేమాటకు అర్థమే లేకుండా పోతుంది. అప్పుడు మిగిలేది యజమాని, దాసి సంబంధం మాత్రమే. నేటి శాసనాలు ఇంకా సమాజంలోని పురుషాధిక్యానికి ప్రతీకలుగానే ఉన్నాయి. స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని ప్రతిపాదించే పద్ధతిలో శాసనాలను సంస్కరిస్తే తప్ప కుటుంబంలో సహకార భావన ఏర్పడదు. పైకి కనపడే సహకార భావన ఐచ్ఛికం కాదు. పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోయి స్త్రీలు ప్రదర్శిస్తున్న వైఖరి మాత్రమే అది. కనుక స్త్రీ పురుషుల సమానత్వం సిద్ధించిననాడు బహుః స్త్రీ తన శ్రమకు విలువ కట్టమని కోరదు. ఆనాడు కుటుంబం వాస్తవంగా ఆమెదవుతుంది. ఇంటి పనిలో పురుషులు కూడా పాలు పంచుకుంటారు. ఆమెచేసే పనిని హీనంగా చూడరు. తాము కూడా చేసేపనిని ఎవరైనా ఎలా నీచంగా చూస్తారు? దాంతో ఇల్లాలికి శారీరక కష్టం, మానసిక వ్యధ తొలుగు తాయి. ఇది సమస్యకు ఒక పరిష్కారమార్గం.

ఇంటిచాకిరితో స్త్రీ జీవితకాలమంతా వ్యర్థమయిపోతోంది. ఆమెకు ఆలోచనాశక్తి, సృజనాత్మకత నశిస్తున్నాయి. విజ్ఞానానికి బదులు అజ్ఞానం ఆవరిస్తోంది. బండరాయిగా బ్రతుకు భారాన్ని మోస్తోంది. గౌరవం, హోదాలకు దూరమవుతోంది. వ్యక్తివికాసం మృగ్యమవుతోంది. 'పోషింపబడుతున్నా'ననే కించతో మూగ జీవిలా బ్రతుకుతోంది. కనుక స్త్రీ తాను గృహిణిగా గుర్తింపు పొందాలనే మానసిక దాస్య విముక్తి నుండి బైటపడాలి. ఇంటాబైటా శ్రమిస్తే నీవు అలసిపోతావనే కల్లబొల్లి కబుర్లను నమ్మరాదు. ఇంటిచాకిరీ ఇద్దరం చేద్దాం; బైట పనికి కూడా భాగస్వామ్యం వహిద్దాం అని ఆదేశించే ధైర్యం స్త్రీలలో కలిగిననాడే ఆమెకు నిజమైన విముక్తి సిద్ధిస్తుంది. ఆమె ఉద్యోగినిగా వుంటేనే అవమానాలకు, నిరాదరణకు లోనుకాదు. ఆనాడే తానూ ఉత్పత్తిలోనూ, సామాజిక సేవారంగంలోనూ తన కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటుంది. ఆనాడే ఇంటి చాకిరి అనే 'వెట్టిచాకిరి' నుండి బైటపడి, దాస్య శృంఖలాలను త్రెంచుకొని భవిష్యత్తుకు బాటలు నిర్మించుకుంటుంది. మరి ఆ రోజు ఎప్పుడొస్తుందో!

# విధవరాలి పరిస్థితి మారదా ?

మా ప్రక్కింటి అన్నదమ్ములు వెంకన్నా, సీతన్నా ఆస్తి అంతా చెరి సగం పంచుకున్నారు. వారికొక విధవాడబడుచు ఒక ఎకరం పొలం మిగిలాయి. ఒకరికి పొలం, రెండోవారికి ఆ పిల్ల చెందాలని వాళ్ళ తండ్రి చెప్పాడు. ఆ పిల్ల కావాలి అని ఇద్దరూ వాదులాడు కుంటున్నారు. అదేమిటండీ పొలం మీద పంట వస్తుంది పిల్లను తీసు కున్న వారికి ఖర్చు తగులుతుంది కదా అని ప్రశ్నించినప్పుడు వారు "అమ్మాయి అయితే బ్రతికి నన్నాళ్ళూ మా కుటుంబానికి చాకిరీ చేస్తోంది. పైగా అట్లుపోసి అమ్మి రాబడి కూడా తెస్తుంద"ని సమాధానం చెప్పారు. వారి దూరదృష్టికి నేను విస్తుపొయ్యా నంటే నమ్మండి. రక్షణ లేని ఆమెపై అందరికీ హక్కు వుంటుంది. అందరూ ఆమె శక్తిని వాడుకోవాలనే గాని ఆమె అభివృద్ధి కోరే వారే అరుదవుతారు. ఆమె శ్రేయ స్సుపై గాని, ఆమె ఇష్టాఇష్టాలపై గాని ఏ ఒక్కరికీ శ్రద్ధ వుండదు. ఆఖరికి కన్న తల్లిదండ్రులకే బరువవుతుంది. అత్తమామలు, అన్నదమ్ములు, వదినెలు ఆమెను వేరు పురుగుగా చూస్తారు. బావలు, మరుదులు ఆమె వారసత్వాన్ని ఎలా భంగపరుద్దామా అని ఆలోచిస్తారు. చదువుకుందామంటే చదివించే నాథుడే వుండడు. పెళ్ళాడుదామంటే "మళ్ళీ పెళ్ళా!" అంటు అసహ్యంగా చూస్తారు. వయస్సు మళ్ళినవారు సైతం కన్యలనే కోరతారు కాని భర్తృవిహీనలంటే అతి నీచంగా చూస్తారు. వైధవ్యం ఆమె కోరుకున్న వరం కాదు. కావాలని తెచ్చుకున్న దోషం అంతకన్నా కాదు. అది ఆమెపై అనుకోని అశనిఘాతంగా వచ్చిపడ్డ మహోపద్రవం.

ఈ సమాజంలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. మరెన్నో సమస్యలు తీరుతు న్నాయి. ఇంకెన్నో మారబోతున్నాయి. కాని మారని సమస్య మన విధవరాండ్రదే. వారి వేషభాషల్లో కొద్ది మార్పు వచ్చినా జీవిత విధానంలో ఏ మార్పు రాకబోవటం శోచనీయం. వారిటు పుట్టింటివారికి, అటు అత్తింటివారికీ కూడ బరువే. అదిచాలక "తల చెడ్డ దానికి భోగభాగ్యాలెందుకూ పడివుండక" అంటూ ఈసడిస్తుంది సమాజం. "పూర్వజన్మ పాప ఫలం వల్ల ఇలాంటి దశ వచ్చింది" అంటారు తోటి స్త్రీలు. "చేసుకున్న వారికి చేసుకున్నంతా, అనుభవించక తప్పుతుందా? ఏనాడో ఏ పచ్చని కాపురంలోనో నిప్పులు పోసింది—అనుభవిస్తున్నది. మనమేం చేస్తాం" అంటూ దెప్పి పొడుస్తారు తోబుట్టువులు. 'నా పాప ఫలం' అంటాడు తండ్రి. "నా తలరాత వల్లనే దాన్ని కన్నాను. దాన్ని కన్నాను కాని దాని అదృష్టాన్ని కనగలనా? దానితో పాటు

నేనూ అనుభవించక తప్పుతుందా అంటూ వాపోతుంది తల్లి. నెత్తిమీద గుడ్డ ఆ దేముడే తొలగించి నప్పుడు, నుదుటిమ్రాత అలా వ్రాసివున్నప్పుడు అనుభవించక తప్పుతుందా? ఇలా అందరికీ లోకువై అందరి చేత ఈసడింప బడుతూ ఎడారి లాంటి జీవితాన్ని సాగిస్తుందా అభాగ్యురాలు.

ఏ నేరం లేకుండా, ఏ తప్పూ చేయకుండా శిక్ష అనుభవించేది ఎవరయ్యా అంటే విధవాడబడుచు అని రూఢిగా చెప్పుకోవచ్చు. అంతేకాదు ఒక చెంప జీవితంలో తీరని పెద్ద నష్టాన్ని పొంది బ్రతుకు భారంతో గడుపుతున్న ఆమెపై జాలి లేక పోగా, దయ, కరుణ చూపక పోగా దెప్పిపొడవటంలో న్యాయమేమిటో అర్ధం కావటం లేదు. అందరికీ చాకిరీ చేస్తూ అందరికీ లోకువగా బ్రతకటమే ఆమె జీవిత ధ్యేయం, పరమా వధి అవుతోంది.

ఇక పిల్లలున్న తల్లి, ఆస్తిలేని తల్లి, ఉద్యోగార్హతలేని తల్లీ అయితే ఆమె కష్టాలు చెప్పనలవి కానివిగా వుంటాయి. ఇంటి పని, పిల్లల పని, వారి పోషణ భారం అనంతంగా వుంటుంది. వారి చదువు, ఆరోగ్యం లాంటివి అనుక్షణం ఆమెను వేధిస్తూనే వుంటాయి. అష్టకష్టాలు పడి పెంచిన ఆ పిల్లలే పెద్దవారయ్యాక పెళ్ళి అయ్యాక ఆమెకు ఇంత తిండీ, గుడ్డా కూడ ఇవ్వరు. తండ్రి ఆస్థికి మాత్రం వారసులు అవు తారు. ఇంక ఈపీడ విరగడ అయ్యేదెప్పుడా అని ఎదురు చూస్తూ వుంటారు.

'విడో' కాగానే ఆమె పరిస్థితి అంతా తారుమారవుతుంది. కొన్ని విధులు, బాధ్య తలు ఆమెకై కేటాయించ బడతాయి. ఎదురుగా వస్తే "అపశకునం" అంటారు. శుభ కార్యాలలో పాల్గొనరాదు. తన బిడ్డ పెళ్ళిని కూడ తాను దూరంగా వుండి చూడాలి. ఆభరణాలు అసలే ధరించరాదు. గాజులు, పూసలు త్రెంచుకోవాలి. క్రింద పడుకోవాలి. చౌకబారు దుస్తులు ధరించాలి. తెల్లబట్టలు ధరించుట, జుట్టు తీయుంచుకొనుట, గాజులు చిట్లించుట, బొట్టు చెరుపు కొనుట, తాళి తెంచుట లాంటి చర్యలు ఇంకా మనకు దర్శన మిస్తూనే వున్నాయి. భర్త మరణానంతరం ఆమె జీవితమే ఒక సుడిగుండంలో పడి పోతుంది. ఆమె అంతం తోనే ఆ సమస్య పరిష్కారమవుతుంది. అందుకే ఆనాడు సహగమనాన్ని ఏర్పాటు చేసి కాల్చి చంపేవాళ్ళు. ఈనాడు మరోరకపు చితి-అంటే సాంఘికాచారాల పేరుతో భస్మం చేస్తున్నారు. ఏ పరపురుషుడితో నైనా మాట్లాడితే ఆమెకు రంకులు కట్టడం సర్వత్రా చూస్తున్నాం.

ఒకప్పుడు బిడ్డలు లేని విధవరాలికి "నియోగం" పేరుతో కుటుంబ సభ్యుల వల్ల బిడ్డను కనమని ఒత్తిడి చేసేవారు. బిడ్డలు లేని తండ్రికి సద్గతులు వుండవని వాత్రి

ఖావం. అంటే ఆమె జీవితం అంతటా పురుషుడే కేంద్రమై నడయాడతాడని దాని ఖావం. ఇవన్నీ ఆనాడే కాదు, వందల సం॥ల తర్వాత ఈనాడు కూడ చలామణిలో వుండటం ఆశ్చర్యకరం, అనాగరికం కూడాను.

19వ శతాబ్దంలో ఈశ్వర చంద్ర విద్యాసాగర్, స్వామి దయానంద సరస్వతి, మహాత్మాపూలే లాంటి సంస్కర్తలు వితంతువుల దుస్థితికి వగచి, వితంతు వివాహాన్ని ప్రోత్సహించటానికి చేసిన ప్రయత్నాలన్నీ వమ్ము అయ్యాయి. పరాశర స్మృతిలో విధవావివాహాలు విరుద్ధాలు కావని చెప్పినట్లు నిరూపించాడు విద్యాసాగర్. ఆదొక వుద్యమంగా నిరూపించి వెయ్యిమందిచే వితంతు వివాహం శాసనం కావాలనే ఒక 'పిటీషన్' లండన్ పంపాడు. ఆనాడు హిందూ వర్గంలో అలజడి, దూషణ పెచ్చుపెరిగాయి. వెంటనే సనాతన హిందువులు 40 వేల మంది చేత విధవా వివాహం శాసనం కారాదంటూ వ్యతిరేకంగా సంతకాలు చేయించి ఇంగ్లండుకు పంపారు. ఏది ఏమయినా 'ఫిడో రిమేరేజి బిల్లు' 1856లో పాసయింది. అలా 1856లో వితంతు వివాహ బిల్లు చట్టరూపం ధరించింది. అయినా అదింకా ఆచరణలో శూన్యంగానే మిగిలిపోయింది.

ఈశ్వర చంద్ర విద్యాసాగర్ 1856లో పోలీసు మద్దతుతో ఒక వితంతు వివాహాన్ని జరిపించ గలిగాడు. ఆ వివాహానికి హాజరైన వారినందర్నీ సంఘ బహిష్కరణ చేశారు ఆనాటి పెద్దలు. తరువాత విద్యాసాగర్ కుమారుడొక వితంతువును పెళ్ళాడాడు. మహారాష్ట్రలో కార్వే తానొక వితంతువును పెళ్ళాడి ఉద్యమాన్ని పెంచాడు. బాల్య వివాహాలు అనంతంగా వుండేవి ఆ రోజుల్లో. అందువల్ల బాల వితంతువులు అపరిమితంగా వుండేవారు. వారి కొరకు ఒక స్కూలును స్థాపించాడు మహర్షి కార్వే. అంతే కాదు, ఆయనే ఒక వితంతువును వివాహమాడి ఆదర్శప్రాయుడయ్యాడు.

దరిమిలా ఆ వుద్యమాని కొక విలువ, గౌరవాన్ని తెచ్చి పెట్టింది కందుకూరి వీరేశలింగం గారని మనందరికీ తెలుసు. భార్య రాజ్యలక్ష్మమ్మ సహాయ సహకారాలతో ఆయన అష్టకష్టాలు పడి కొన్ని వివాహాలు చేయగలిగాడు. ఆ దంపతుల శ్రమ వల్లనే వితంతు వివాహం మహోద్యమంగా మారింది. ఎన్ని ప్రతిఘటన లొచ్చినా మరెన్ని దుశ్చర్యలు సలిపినా మొక్కవోని స్థిర చిత్తంతో నిలిచాడా మహర్షి. దరిమిలా ఆ వుద్యమాన్ని చేపట్టి దాన్ని ప్రజోద్యమంగా మార్చినవారు అరుదయ్యారు.

ప్రస్తుతం అక్కడక్కడా వివాహాలు జరుగుతున్నా, అది సహజంగా చూడబడటం లేదు. ఆ వరుడు సైతం తానేదో మహా త్యాగం చేసినట్లుగానే ప్రవర్తిస్తాడు.

ఆ వధువు కూడ తానేదో మహానేరం చేసినట్లుగా భావిస్తుంది. అదే కనుక ఒక 'విడో యర్' (విధురుడు) 50 ఏళ్ళ వాడయినా, ఎందరు పిల్లలున్నా మళ్ళీ పెళ్ళాడటంలో తప్పు లేదంటుంది సమాజం. ఇదొక విధంగా ద్వంద్వ నీతి. దీనికి మూలం పురుషాధిపత్య సమాజం కావటమేనని వేరే చెప్పాల్సిన పనిలేదు.

వితంతువుల ఈ దుస్థితికి మూలకారణం ఆర్థికం, సామాజికంకూడ. అంతేకాదు, ఆమెకు తగిన విద్య, ఉద్యోగం వుండవు. కన్నవారు కట్నం ఇచ్చి పెళ్ళిచేసి చేతులు కడుక్కుంటారు. పైగా మళ్ళీ పెళ్ళాడితే తమ కుటుంబ పరువు పోతుందనీ, మిగతా పిల్లలకు పెళ్ళిళ్ళు కావని వాదిస్తారు; అదీగాక ఏ సహాయం చేయలేని పరిస్థితిలో వుంటారు. ఆమె అత్తమామలు సైతం "మా బంధమే పోయాక మేమేం చేయగలం, కాకపోతే చాకిరీ చేస్తూ పడి వుంటే ఇంత పడేస్తాం" అంటారు అత్తవారు, పుట్టింటి వారు కూడ అదే ధోరణిలో వుంటారు. అందుకే ఈ అనాదరణ భరించలేక వితంతువులు వారణాసి లాంటి పుణ్యక్షేత్రాలలో జీవితాన్ని వెళ్ళబోసుకుంటూ వుంటారు. అలాంటి వారి సంఖ్య వేల సంఖ్యలో ఇప్పటికీ వుందని మనకు తెలియనిది కాదు. అలాంటి వారికి కొన్ని రాష్ట్రాలలో 30-40 రూ॥ల పింఛన్ ఇస్తున్నారు. కొన్ని సమాజాల్లో వారి చేత భజనలు చేయించి, పాటలు పాడించి, ఇంటి పనులు చేయించి పోషిస్తున్నారు. ఆయా పనులు, పళ్ళపూసలు, పూలు అమ్మి జీవిస్తూ వుండటం మనకు కనిపిస్తూనే వుంటుంది. ఇంక ఏ గతీ లేనివారు పడుపువృత్తి లోకి దిగజారి పోవటం మనకు తెలియనిది కాదు. ఎంత చాకిరీ చేసినా కడుపు నిండని వరుమానం వారికి లభిస్తుంది. ముఖ్యంగా వారికి లభించేది వృత్తి వంటపని మాత్రమే. అదయినా, యవ్వనంలో వున్నవారిని ఏ గృహిణీ తన యింట్లో వుండనివ్వదు. బయట ఒంటరిగా వుంటే యిక ప్రతి ఒక్కరికీ లోకువే. అందరూ కన్నుగొట్టేవారే. ఈ బాధలు భరించలేక కొందరు ఆశ్రమాల్లో చేరిపోతు న్నారు. అక్కడ కూడ వారికి ఎదురయ్యేవి అగచాట్లే. జడధారులు సైతం వారిని చేరరమ్మని పిలిచే సంఘటలెన్నో చూచాం. ఇలా అడుగడుగునా, అనుక్షణం అందరి చేత దోపిడీచేయబడే వాళ్ళు, జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్న వాళ్ళు కోకొల్లలుగా వున్నారు. మన దేశంలో వున్న వితంతువుల సంఖ్య 23 లక్షలున్నట్లు 1931 నాటి 'సెన్సస్' (CENSUS) లో తేలింది. ఈనాడు 2 కోట్ల 50 లక్షలున్నట్లు జనాభా లెక్కల్లో వచ్చాయి. వారిలో సుమారు లక్షమందికి పైగా మైనరు దాటిన వారున్నారు. మరి ఈ యువతుల కైనా పెళ్ళిళ్ళు చేయలేక పోతే మన సంస్కృతికి విలువేముంటుంది? వాళ్ళంతా వేరే తెగ కాదు. మన బిడ్డలే. మన అక్క చెల్లెళ్ళే. మన ఇంటి ఆడబడుచులే

ననే భావం మనలో రానంత కాలం వారి దీనావస్థ తొలగి పోదు. వారిని సంస్కరించ టానికి మనం రెండు పనులు చేయాలి. వారికి పునరావాసం కల్పించటం, పెళ్ళిళ్ళు చేయటం. ఈ పని మనం చేయాలంటే ప్రభుత్వం తమ సంపూర్ణ సహకారం అందివ్వాలి. మహిళా సంఘాలు ఈ పని తమ విధ్యుక్త ధర్మంగా భావించాలి.

స్త్రీలకు కేటాయించిన ఉద్యోగాల్లో వితంతువులకు యాభై శాతం కేటాయించాలి. అలాగే వృత్తి విద్యల్లో వారికి ముందుగా అవకాశం ఇవ్వాలి. వయోపరిమితిని అధిగమించి వారికి ప్రత్యేక సదుపాయాలు కలిగించాలి. ఇళ్ళ స్థలాలు, పట్టాలు వారి పేరుతో ఇవ్వాలి. ప్రత్యేక పాఠశాలలు వారికి నియమించి అందులో హాస్టలు, ఉచిత భోజన సదుపాయాలు ఏర్పాటు చెయ్యాలి. కళాశాలలో సీట్లను కేటాయించాలి. ప్రజలు వారిని తమ తోబుట్టువుల్లా చూడాలి. యువకులు, విద్యార్థులు వారిని వివాహమాడటానికి వెను కాడరాదు. తోటి స్త్రీలు వారిని ఉద్ధరించటానికి తోడ్పడాలి. అలా సర్వులూ వారికి చేయూత నిచ్చిన నాడే వారు స్వతంత్రులు కాగలరు. ఎన్ని చేసినా మరెన్ని చేసినా, వితంతువులు సైతం తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోటానికి సర్వవిధాలా ప్రయత్నించాలి. ఆనాడే వారి సమస్యలు సమసి పోగలవు.

# ఇది విన్నారా? మహిళలకొక ఆశాజ్యోతి

ఇంత వరకు తన భర్త మళ్ళీ పెళ్ళాడితే తానే తన భర్తపై 'బిగమీ' కేసు పెట్టవచ్చు. ఏడు సంవత్సరాల శిక్ష + జరిమానా పడుతుంది. కాని అలాంటిదొక చట్ట మున్నదని తెలియనివారు కోకొల్లలు. తెలిసినా కోర్టుల చుట్టూ తిరగలేనివారు అనంతగా వున్నారు. ఆ పెళ్ళిని రుజువు చేయలేనివారు లెక్కకు మిక్కుటంగా వున్నారు. ఇంకా భయపడేవారు కొందరుంటే, పురుషుడే పని చేసినా తప్పులేదంటూ సర్దుకుపోయేవారు చాలామంది వున్నారు. ఈ మాత్రం నీడ కూడా వుండదని, పతివ్రతలుగా చలామణి కావాలని, ఆడది కోర్టు కెక్కడమా అని ఎత్తిపొడుస్తారని గ్రుడ్లనీళ్ళు కుక్కుకుని జీవయాత్ర సాగిస్తున్నారు. కాని ఇటీవల మన శాసనసభ ఒక క్రొత్త బిల్లును ప్రవేశ పెట్టింది. దాని పూర్వాపరాలను గమనించి ఫలితాలను అనుభవిద్దాం.

భార్యగాని భర్తగాని బ్రతికి వుండగా మళ్ళీ పెళ్ళాడితే అది 'బిగమీ' కేసు అవుతుంది. ఇది 'పీనల్ కోడ్' సెక్షన్ 494 క్రింద నేరం. దీనికి 7 ఏండ్లు శిక్ష.

జరిమానా కూడా విధించవచ్చు. 495 క్రింద, మొదటి పెళ్ళి విషయం దాచిపెట్టి పెళ్ళిచేసుకుంటే పదేళ్ళు శిక్ష, జరిమానా వుంటాయి. 496 క్రింద పెళ్ళితంతు జరిపి, ఆ పెళ్ళివల్ల లా ప్రకారం పెళ్ళికాలేదని తెలిసి పెళ్ళాడితే 7 ఏళ్ళు శిక్ష, జరిమానా విధిస్తారు. తెలిసి వుంటే నష్టపరచాలని, లేదా తనకు లాభించాలని, లేదా మోసగించాలని చేసుకుంటే 494, 495, 496 క్రింద భార్యాభర్తల్లో ఒకరు అర్జీ పెట్టాలి. 495, 496లో రాజీపడటానికి లేదు. 494లో మాత్రం కోర్టు అనుమతితో రాజీపడవచ్చు. దీనిపై విచారణ జరిపే అర్హత మేజిస్ట్రేటుకు లేదు. పైగా అది 'బెయిలబుల్' నేరం కనుక ముద్దాయిని పోలీసులే బెయిలుపై విడుదల చేయవచ్చు.

'బిగమీ' కేసు పెట్టాలంటే ముద్దాయికి ఇంతకుపూర్వం వివాహం జరిగివుండాలి. తిరిగి మరొక వివాహం జరిగినట్లు నిరూపణ చేయాలి. వ్యక్తిగత ధర్మశాస్త్రం ప్రకారం కూడా ముస్లిం స్త్రీకి కూడా ఇది నేరం 'బిగమీ' తప్పుగా భావించని కొన్ని జాతులకు కూడా ఈ నేరం వర్తిస్తుంది. ఒక వివాహితుడు అవివాహితతో కలిసి తిరుగుతుంటే అది నేరంకాదు. పెళ్ళిజరిగితేనే నేరం. రెండవ వివాహం నేరంగా లేని మరో మతంలోకి మారి పెళ్ళిచేసుకుంటే అది కూడా 'బిగమీ' నేరం క్రిందికి వస్తుంది. ఈ కేసు ఇంతవరకు భార్యాభర్తలే పెట్టాలి. కొన్ని సందర్భాలలో పిల్లతండ్రి కూడా అర్జీపెట్టవచ్చు.

క్రొత్త బిల్లులోని ముఖ్యాంశాలు. ఈ సవరణబిల్లు 1986 జులై 25న ప్రవేశపెట్టబడింది. 87 జులై శాసన సభలో ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. కొద్ది నెలలలో చట్టం కాబోతోంది. ఇందులో కొనియాడ తగిన విషయం-మామూలుగా ఆడవారు భర్తలు చంపుతారనో, హింసిస్తారనో భర్తపై కేసుపెట్టి జైలుకి పంపరు. కాని ఈ సవరణ వల్ల స్త్రీలకు కొంతమేలు జరుగుతుంది. ఈ నేరం 'కాగ్నైజబుల్' మరియు 'నాన్ బెయిలబుల్' నేరంగా మార్చబడింది. అంటే పోలీసు ఆఫీసరు ఈ నేరాన్ని తానుగా దర్యాప్తుచేసి, ఆ వ్యక్తిని అరెస్టుచేసి, కేసును దాఖలు చేయవచ్చు. కోర్టుకు హాజరు పరిస్తే కోర్టువారు మాత్రమే కేసునుపెట్టి బెయిలు ఇవ్వవచ్చు. అంతేకాదు పూర్వమయితే ఈ కేసుపెట్టిన వ్యక్తి రాజీపడవచ్చు, కేసును ఉపసంహరించుకోవచ్చు. నేడు అలాంటి అవకాశంలేదు. కోర్టువారి తీర్పు, లేక, అనుమతి పైననే రాజీ జరుగుతుంది. పోలీసులు స్వయంగా 'ఈ బిగమీ' కేసును దాఖలు చేయటమనేదొక గొప్ప సదవకాశం.

మరో ముఖ్యవిషయం. ఈ వివాహం జరిగినట్లు తెలుసుకొన్న ఏ వ్యక్తి అయినా రిపోర్టు ఇవ్వవచ్చు. అది తెలిసిన పోలీసులు ఆ వ్యక్తిని అరెస్టు చేయవచ్చు. కనుకనే ఇది 'కాగ్నిజబుల్ అఫెన్సు'గా మారింది. నిందితుణ్ణి వెంటనే ప్రాసిక్యూట్ చేయట మనేది నిజంగా స్త్రీల పాలిట వరప్రసాదం. మోసాలు జరుగుతాయనేది వేరే విషయం. అసలు అనుకూలమైన చట్టం వుండటమే ఒక విధంగా పురోగమనంగా భావించాలి. ఈ సవరణ ఉద్దేశాలు, కారణాలు—వివాహ పరమైన సాంఘిక దురాచారాలను అరికట్టటానికి. కఠినశిక్షల ద్వారా నిందితుణ్ణి బంధించడం గొప్పవిషయం. 1974లో క్రిమినల్ ప్రొసీజరు కోడును శాసనంగా రూపొందించే టప్పుడు ఈ నేరాలను విచారణార్హం కానివిగా, బెయిలు ఇవ్వతగినవిగా ఆ కోడులోని ఒకటవ అనుసూచికలో పేర్కొనడం జరిగింది. కాని ప్రస్తుత పరిస్థితిలో ప్రభుత్వం ఈ నేరాల దర్యాప్తులో సమర్ధవంతంగా పాల్గొంటే తప్ప సామాన్య మానవుడు (ముఖ్యంగా స్త్రీలు) ప్రయివేటు వ్యాజ్యాలు నడిపించటం సాధ్యంకాదు. ఈ బిల్లు క్రిమినలు ప్రొసీజరును మన రాష్ట్రానికి వర్తించే విషయంలో క్రమబద్ధం చేస్తుంది. ఈ చట్టాన్ని 1986 క్రిమినల్ ప్రొసీజరు కోడు (ఆం. ప్ర. సవరణ) చట్టంగా వ్యవహరించవచ్చు. ఇదిమన రాష్ట్రాని కంతటికీ చెందుతుంది. వెంటనే అమల్లోకి వస్తుంది. ఈ నేరానికి ఇకముందు బెయిలు ఇవ్వటం జరగక పోవచ్చు. ఈ నేరస్తుని మొదటి తరగతి మేజిస్ట్రేటు మాత్రమే విచారించటం జరుగుతుంది.

ఇకముందు ఈ నేరస్తుణ్ణి పట్టి బంధించటానికి, శిక్షించటానికి మహిళాసంఘాలు, మహిళలు చేయూత నివ్వాలి. కేవలం బిల్లులూ, చట్టాలు వున్నంత మాత్రాన లాంభించేది ఏమీలేదు. ఆ అవకాశాన్ని వాడుకునే ధైర్యం స్త్రీలలో రావాలి. ఆ హక్కులు అనుభవించుకోలేక పోతే అవి తుప్పుపట్టి పోతాయి. ఆ భర్తలు విర్రవీగి పోతారు. కొందరైనా స్త్రీలు ముందుకొస్తే ఆ భర్తలకు శిక్షలు వేయిస్తే మిగతావారు భయపడతారు. మిగతా స్త్రీలకు ధైర్యం వస్తుంది. లేకపోతే మనం నిర్వీర్యులమయి పోతాం. కనుక ప్రతిహక్కునూ అనుభవించిననాడే మనలో ఆత్మవిశ్వాసం వస్తుంది. మరి ఆలోచిస్తారా?

# ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి ?

కరుణ చీరెలు కొనడానికి నాంపల్లి వెళ్ళింది. దుకాణంలో అడుగు పెట్టబోయే సమయానికి ఆమె చిన్ననాటి నెచ్చెలి ప్రియంవద రెండు 'ప్యాకెట్ల'తో బయటికి వస్తూ కనిపించింది. ఒకరి నొకరు ఆప్యాయింగా కౌగలించు కున్నారు వీధిలో ఒక మూల నుంచొని అరగంట పైగా చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకున్నారు. తమ స్నేహితులను గురించి నెమరు వేసుకున్నారు. ప్రియంవద తన "విజిటింగు కార్డు"ను కరుణ చేతి కిచ్చింది. అది చదివి కరుణ విస్తుపోయింది. ఆందులో ఆమె పేరు "ప్రియంవద వల్లూరి" అని రాసి వుంది.

"మీ అత్తవారు కస్తూరి వారు కాదటే" అని కరుణ తన స్నేహితురాలిని అడిగింది. ప్రియంవద చిరునవ్వు చిందిస్తూ "అది పాత సంగతి" అంది. కరుణకు జ్ఞానోదయ మయింది. ప్రియంవద కస్తూరి వెంకట్రావుకు విడాకులు ఇచ్చి వలూరి వారి యువకుణ్ణి రెండో పెళ్ళి చేసుకున్నదని కరుణ గ్రహించింది. "ఇంతకూ మీ ఆయన పేరు చెప్పావుకాదేమిటి?" అని కరుణ నిలదీసింది. "అభయంకర్" అని బదులు చెప్పింది ప్రియంవద ముసిముసి నవ్వులతో. "వారి తాతల కాలం నుండీ పూనాలో నివాసం ఏర్పరుచుకున్నది మా మామగారి కుటుంబం" అని ముక్తసరిగా చెప్పి, గడియారం చూచుకొని, ఇంటికి వెళ్ళాలని తహతహలాడుతూ పరుగెత్తి వెళ్ళింది ప్రియంవద.

కరుణ మహిళోద్యమ కార్యకర్త. పెద్దగా డిగ్రీలు సంపాదించక పోయినా, చదవటం, వ్రాయటం, తెలిసిన విషయాలు ఇతరులకు చెప్పటం ఆమెకు అలవాటు, చాలా నిశితంగా ఆలోచించటం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. ఇంటికి వచ్చిన కరుణ ఆలోచనా సాగరంలో కొట్టుమిట్టాడి పోతోంది. ఆమెను అనేక భావాలు చుట్టు ముట్టాయి.

బాలిక బళ్ళోకి చేరేటప్పుడు ఆమె తండ్రి పేరు, తండ్రి ఇంటిపేరు రాస్తున్నారు. పెండ్లి అయిన తరువాత భర్త పేరు, భర్త ఇంటిపేరు రాయడం మొదలవుతుంది. మరి ఆమె, ఆమె భర్త విడాకులు పుచ్చుకుంటే ఆమె ఇంటిపేరు ఏదవుతుంది. భర్త వదిలినా, భర్త ఇంటిపేరు ఆమెను వదలదు. ఆమె మళ్ళీ ద్వితీయం చేసుకుంటే రెండో భర్త ఇంటిపేరుతో ఆమె పిలువబడుతుంది, ఇలా సాగిపోతుంది "మహిళాభ్యుదయం". ఆమెకంటూ నిలకడగా ఇంటిపేరు ఉండదు. మారని ఇంటిపేరు ఉంటే బాగుండును! ఆమాటకు వస్తే ఆమె తల్లిపేరును తన పేరుతో జోడిస్తే అది మారదుకదా! అలాగే

తన తల్లి ఇంటిపేరు తనదిగా చేసుకొంటే అదీ మాటి మాటికీ మారవలసిన అవసరం లేదు. ఇంతకూ తన తల్లికంటూ ఒక ఇంటి పేరు ఉన్నదా ఇప్పుడు. లేనేలేదు. తన స్థితే తన తల్లిదీను, కొన్నాళ్ళు తండ్రి ఇంటిపేరు, వివాహం కాగానే భర్త ఇంటిపేరు ఆమెకూ వచ్చాయి. కారణం ఏమిటి? ఆ "మనువు" చేశాడు ఇదంతా! బాల్యంలో స్త్రీకి తండ్రి రక్షకుడని, యౌవనంలో భర్త, వార్థక్యంలో కుమారుడు ఆమెను కాపాడాలని చెప్పాడు కదా! అందుకే వచ్చింది ఈ తంటా అంతా. రోజులు మారాయి, మారుతున్నాయి; మారాలి కూడాను. సరే పాత చరిత్ర ఎందుకు. ఎప్పుడో అప్పుడు ఎక్కడో అక్కడ సంస్కరణ ప్రారంభించాలి గదా! ఎందుకు? ఎలా?

భాష ఎలా ఉంటే ఏమని కొందరు అమాయకంగా ప్రశ్నిస్తారు. మరికొందరు ఇన్ని వేల సంవత్సరాల ఆచారాన్ని మార్చటం తెలివి తక్కువ కాదా అని హెచ్చరిస్తారు భాషకూ భావాలకు అవినాభావ సంబంధ ఉన్నది. భాష మనకు తెలియకుండానే మన భావాలను నిర్దేసిస్తుంది. భర్త ఇంటిపేరు స్త్రీలు పెట్టుకున్నారనుకోండి. భర్త మారినప్పుడల్లా ఇంటిపేరు మారితే చికాకు కదా? వ్యవహారాలలో స్థిరత్వం ఉండా లంటే పేరు తేపతేపకు మారకూడదు కదా! అసలు సంగతి ఏమంటే 1948 వరకు, ఆచారాన్ని మినహాయిస్తే 1955 వరకు విడాకులు లేవు. (పూర్వపు మదరాసు రాష్ట్రంలో అయ్యదేవర కాళేశ్వరరావు ధర్మమాయని 1948 నుండి అమలులోకి వచ్చాయి). కాబట్టి పూర్వీకులకు ఈ ఇబ్బంది లేదు కాలం మారింది కదా! విడాకులు, పునర్వివాహాలు తప్పుగా భావించడం లేదు ప్రజలు కాకపోతే తమకు తెలియకుండానే భర్తను అతడు జారుడైనా, క్రూరుడైనా, దుష్టుడైనా, దుర్మార్గుడైనా అవినీతిపరుడైనా అంటిపెట్టుకొని, బాధలతో కృంగి. కృశించుపోతూ జీవితం గడపటం ఆనవాయితీ అయింది. అది ధర్మంగా చలామణీ జరిగింది. దాంతో విడాకులు తీసుకోవాలనే భావం ఆమెకు స్ఫురించకుండా సాగిపోతుంది. ఒక స్త్రీ ప్రసిద్ధురాలయిందనుకోండి. ఆమె పేరు పుల్లమ్మ అనుకుందాం. ఆమె పుట్టింటివారు పప్పువారు. మొదటి భర్తపేరు నేతి వెంకయ్య. రెండవ భర్త భాగవతుల కోట. ఆమె అవివాహిత గానే పేరు ప్రఖ్యాతులు పొందింది. ఆమె తనను ఎలా పిల్చుకోవాలి; తనపేరు ఎలా నమోదు చేయించుకోవాలి ప్రభుత్వ రికార్డులలో "పప్పు పుల్లమ్మ" వరపు "నేతి పుల్లమ్మ" అని కొన్నాళ్ళూ చివరకు "పప్పు పుల్లమ్మ వరపు నేతి పుల్లమ్మ వరపు భాగవతుల పుల్లమ్మ" అని రాసుకోవాలా? లేకపోతే పుల్లమ్మ (పప్పు/నేతి/భాగవతుల) అని రాసుకోవాలా? అలా కాకుండా "పప్పు పుల్లమ్మ అని మాత్రమే వ్రాసుకోవాలా? లేక ఈ అర్ధశతాబ్ది ఫ్యాషను ప్రకారం

భర్తమీది మమకారంతో "పుల్లమ్మ వెంకయ్య, యన్" అని వ్రాసుకోవాలా? మరి వెంకయ్యను వదిలివస్తే తరువాత ఆమెపేరు ఎలా ఉండాలి? "పుల్లమ్మ వెంకయ్య" యేనా ఆమె పేరు. వెంకయ్య జీవితంలో వదిలినా పేరులో వదలడా? ఎంత విచిత్ర పరిస్థితి! కోటను పెళ్ళాడగానే ఆమె పేరు "పుల్లమ్మ కోట, బి"గా మారాలా? ఇలా మారుస్తుంటే గందరగోళానికి దారితీయదా? ఇంతకూ ఆమె వైవాహిక జీవితానికి సంబంధించిన వివరాలు ఎప్పటికప్పుడు సమాజానికి తెలియజెయ్యాలా? అవి సమాజానికి అంత ఆసక్తిదాయకాలా? మరి పురుషుల విషయంలో ఆలా లేదే! అతగాడు "వెంకయ్య పుల్లమ్మ యన్" అని కాని "కోట పుల్లమ్మ. బి" అనికాని పిలుచుకోడే! అతనికి భార్య మీద ప్రేమాభిమానాలు లేవా? లేవని అనడం న్యాయం కాదు. మరి అతడు వరుసగా మూడు పెళ్ళిళ్ళు చేసుగాన్నాడను కోండి ఆ చరిత్ర అతని స్నేహితులకూ, బంధువులకూ తప్ప మరెవ్వరికీ తెలియదే? తెలియవలసిన అవసరం న్యాయంగా లేదు; నిజమే. కాని, ఆ సూత్రం స్త్రీ విషయంలో వర్తించదేం? ఎందుకు ద్వంద్వనీతి? పురుషుడికి వర్తించేది ఒక సూత్రం, స్త్రీకి వర్తించేది మరో సూత్రం. ఎందుకు ఈ వివక్ష?

ఇంతలో కరుణకు మరో ఆలోచన మెదిలింది మెదడులో. నేతి వెంకయ్యకు విడాకులు ఇచ్చిన దరిమిలా "నేతి పుల్లమ్మ" అని తనపేరు రాసుకోకుండా కేవలం "పుల్లమ్మ" అని వ్రాసుకుంటే బాగుండదా? అయితే ఆంధ్రప్రదేశ్‌లో పుల్లమ్మలు కోకొల్లలుగా ఉన్నారే? మరి "ఏ పుల్లమ్మ" అనే ప్రశ్న ఉదయించదా? పరిస్థితి మరీ చిక్కుగా తయారవుతుంది మరి పరిష్కార మార్గం లేదా?

ఇంత చిన్న విషయానికి చిక్కు విడదీయలేమా? అసలు ఆ మాటకు వస్తే ఇది చిన్న విషయమా? ఇది పితృస్వామ్యవ్యవస్థకూ, పురుషాధిపత్యానికీ, పురుష దురహంకారానికీ సంబంధించిన విషయం. స్త్రీని గురించి రికార్డు రాసేటప్పుడు తండ్రిపేరు కాక భర్తపేరు ఎందుకు రాయమని కోరాలి? వోటర్ల జాబితాలో అలా ఎందుకు నమోదు చేయాలి? వివాహిత పురుషుడి భార్యపేరు వ్రాయమని అడగటం లేదే? అతడు తండ్రి పేరు రాస్తే సరిపోతున్నదే! అంటే తండ్రి, భర్త నామకులు, గొప్పవారని దాని భావం. తల్లి, భార్య లెక్కలోకి రారని తేలుతుంది.

నిజానికి రూఢి అయిన విషయం ఏమిటి? శిశువును ప్రసవించేది స్త్రీ. కనుక సంతానం ఆమెది అని గట్టిగా, నిశ్చయంగా తేలుతుంది. తండ్రి ఎవరో తల్లి చెప్పిన దానిని బట్టియో లేక తల్లితో కాపురంచేసే పురుషుని వివరాన్ని బట్టియో తేలుస్తాం. అంతే

కాని ఫలాని వారి కుమారుడు లేక కుమార్తె అని శారీరక సత్యంగా నిర్ధారించలేము. మరి తల్లి పేరుతో, తల్లి ఇంటి పేరుతో చలామణీ అవటం సహజం, హేతుబద్ధం, న్యాయం కాదా? ఇందాకటి ఉదాహరణ తీసుకుంటే ఆమెను "పప్పు పుల్లమ్మ" అని పిలవచ్చు కదా. ఆమె ఎన్నిసార్లు పెళ్ళి చేసుకున్నా "పప్పు పుల్లమ్మ" గానే ఉంటుంది. భర్త పేరు రాయవలసిన అవసరం తీసివేసి ఆ మాటకు వస్తే తండ్రిపేరు కూడా రాయ కుండా—తల్లిపేరు రాయవచ్చు "పప్పు పుల్లమ్మ తల్లి సుందరమ్మ" అని వోటర్ల జాబి తాలో, ప్రభుత్వ రికార్డులలో, విద్యాలయాలలో రాయవచ్చు. ఇది సర్వదా ఆక్షేపణ చేయటానికి వీలులేని విషయం; చికాకుకు, గంగరగోళానికి అవకాశమివ్వని అంశం. ఈ పద్ధతిని అనుసరించటం మంచిదేమో!

అయితే ఒక పేరుతో ప్రసిద్ధి పొందిన వారి సంగతేమిటి అని ప్రశ్నించవచ్చు. వారి విషయాన్ని ఈ సిద్ధాంతానికి మినహాయింపుగా ఎంచుకోవచ్చును. కాగా ముందు తరం మాత్రం ఈ సమస్యను గురించి ఆలోచించవలసిన తరుణం ఆసన్నమయింది. ఇది కేవలం పురుష ద్వేష సమస్య కాదు. స్త్రీల వ్యక్తిత్వ నిర్ధారణ సమస్య. దీనిని సహృదయంతో, ఆవేశ కావేషాలకు అతీతంగా చర్చించి తేల్చుకోవాలి. ఆ ప్రయత్నానికి స్త్రీ లోకం పూనుకుంటుందని ఆశించడం అత్యాశ కానేరదు.

# సహజీవనంలో ఆధునిక పోకడలు

నాగరిక సమాజం ఏర్పడినప్పటి నుండి స్త్రీ, పురుషుడు కలిసి కాపురం వుండట మనేది ఆచార మయింది. తద్వారా కుటుంబ వ్యవస్థ ఏర్పడింది. సమాజ మనే పెద్ద పరిధిలో చిన్న సముదాయంగా వ్యక్తులు సంబంధ బాంధవ్యాలు కలిగి వుంటారు. వీటి పైన సమాజం యొక్క ప్రభావం వుంటుంది. కాని సమాజం మీద కూడా యివి ప్రభావాన్ని చూపిస్తాయి. కలిసి పనిచేసే ముఠాలు, సమిష్టి జీవనం సాగించే కమ్యూన్లు, స్నేహితుల బృందాలు అనేక రకాల కుటుంబాలు ఇలాంటివి. ఆ ప్రజా సముదాయం ఎంత చిన్నదయితే ఎంత సన్నిహిత మైతే దాంట్లో అంత న్యాయం వుంటుంది. నీతి కన్నా సమభావం వుంటుంది. అందులో ప్రేమ కూడ చోటు చేసుకుంటుంది. నీతిఅంటే పొరుగు వాడికి హాని చేయక పోవటం. సమభావన అంటే పొరుగు వాడికి మంచి చేయటం, ఒకరితో ఒకరు ఇష్టంగా వుండటం, సోదర భావం, అభిమానం, స్నేహం, ప్రేమ లాంటివి. ఇవి సమిష్టి జీవనానికి ప్రాతిపదికలు. మానవత్వాన్ని గురించిన భావన ఈ సంబంధాల సన్నిహితత్వాన్ని నిర్దేశిస్తుంది. మనుషులకు శరీరాలే కాక అంతర్జీవితాలు కూడా వుంటాయని గ్రహించాలి. అందువల్లే ఒకరినొకరు సోదర మానవుల వలె లేక, భాగస్వాముల వలె పరిగణించడం జరుగు తున్నది. వారిరువురి మధ్య సమాన హక్కులు, బాధ్యతలూ వుంటాయి. అవతలి వ్యక్తిలోని 'పరాయి తనాన్ని' విమర్శనాత్మక విశ్వాసంతో అంగీకరిస్తారు అంటే సమిష్టి ఆశయాల సాధనకోసం హేతు బద్ధమైన సంప్రతింపు అవసరం. అవతల మనిషిని తన లక్ష్యసాధనకు సాధనంగా లేక పనిముట్టుగా పరిగణింప తగదు. తన స్వేచ్ఛ ఇతరులతో సంబంధం కలిగి వున్నదని గ్రహించి, దాన్ని సాధించుకోటానికి స్వయం నిర్ణయాధికారాన్ని వినియోగించుకొని స్వేచ్ఛను పొందడమే కాక అవతలి మనిషి కూడా స్వేచ్ఛను అనుభవించడానికి అవకాశం ఇవ్వాలి.

స్నేహము, ప్రేమ, ఇష్టత, వీటిపైన ఆధారపడిన సంబంధాలలో ప్రతి ఒక్కరి స్వేచ్ఛ అందరి స్వేచ్ఛగాను, ప్రతి ఒక్కరి స్వయం నిర్ణయాధి కారం అందరి నిశ్చయంగాను వుంటుంది. ఈ సంబంధంలో శృంగార భావన పాత్ర వహిస్తుంది. అవతల వ్యక్తి శారీరకంగా ఎదురుగా వుంటే ఆ భావం కలుగవచ్చు. శృంగారం అంటే సెక్సు కాదు. శృంగార భావన లైంగిక సంబంధానికి దారి తీయవచ్చును, తీయక పోవచ్చును. ప్రేమ వున్నప్పుడే శృంగార భావన సెక్సుకు దారి తీస్తుంది.

ప్రేమ విచిత్రానుభవం. ప్రేమకు లోనయిన వ్యక్తి శరీరం, కళ్లు, గొంతు, నడత అసాధారణ లక్షణాలను పొందుతాయి. ఈ అసాధరణ లక్షణాలను చూచి ఒక వ్యక్తి మరొక వ్యక్తిని ప్రేమించడు. ప్రేమించి నప్పుడే వారిలో ఆ లక్షణాలు పొడసూపుతాయి. ఇది ఒకవ్యక్తి మరొక వ్యక్తితో ఎదురుగా వున్నప్పుడు కూడా ఇలాంటి అనుభవాలే రావచ్చును. ఆ లావుపాటి మనిషి, ఆ నల్లమనిషి, ఆ పెద్దగొంతు మనిషి, ఆ మొరటు మనిషి అనే భావాలు అప్పుడు వుండవు. అప్పుడు అవి చాలా అత్యల్ప విషయాలుగా గోచేరిస్తాయి. కొన్ని లక్షణాల సముదాయంగా కాక అవతలి వ్యక్తిని మరో దృష్టితో చూడటం సంభవిస్తుంది.

ఇదంతా గమనిస్తే పై భావనలు కలుగ జేయని లైంగిక సంబంధాలు సాధ్యమని తేలుతుంది. కేవలం అలాంటి సంబంధాలలో ఒకవక్తి తన శారీరక అవసరాలను తీర్చుకోటానికి మరొక వ్యక్తిని వాడుకోవడం జరుగుతుంది. కాని మనం లైంగికతను మరో రకంగా అర్థం చేసుకోవాలి. కేవలం శారీరక సన్నిహితత్వమే కాక మానసిక సన్నిహితత్వం కూడ మన భావంలో యిమిడి వున్నది. తమ వ్యక్తిగత పరిధిలో నుండి తమ జీవితాలను వెలికి తీసి యిరువురి జీవితాలను పెనవేసుకు పొయ్యే పరిస్థితి అది. ఇది అంత తేలిగ్గా జరిగే పనికాదు. అనివార్యగా జరిగేదీ కాదు. ఇది ప్రేమ వల్లనే సాధ్యమవుతుంది. తమ స్వతంత్రతను పోగొట్టు కుంటున్నామనే భావం వారిని వెన్నాడుతున్నా, ప్రేమ బలం వల్ల ఒకరి కొకరు బాధ్యత వహించే స్థితికి వస్తారు. నిజమైన, సరి అయిన లైంగిక సంబంధంలో ఈ లక్షణాలు వుంటాయి.

స్త్రీ పురుషుల సన్నిహితమైన శాశ్వత కలయిక వివాహ బంధంలో వుంటుంది. వివాహం ఇద్దరి నిర్ణయం మీద ఆధారపడుతుంది. పురోహితుడు లేక రిజిస్ట్రారు—వీరి ఆమోదం వున్నంత మాత్రాన వివాహబంధం ఏర్పడిందని అనుకోటానికి వీల్లేదు. స్త్రీ పురుషులిద్దరూ ఒక ఆర్థిక 'యూనిట్'గా కలిసి జీవించటానికి జరిగే నిర్ణయం అది. సమిష్టి కుటుంబాల్లో, కమ్యూన్లలో అది భాగం కావచ్చు. వివాహ వ్యవస్థను సంప్రదాయాలు, శాసనాలు నియంత్రణం చేస్తున్నాయి. ఒక్కొక్కప్పుడు ఇది బాధాకరంగా పరిగణించవచ్చు. కాని ఉద్యోగం, గృహవసతి, శిక్షణ, సామాజిక సేవలు అందించడానికి అనువుగా శాసన ప్రమేయం తప్పదు. అంతేకాక కుటుంబానికి, సమాజానికి సంబంధం నిర్దేశించటానికి, కుటుంబంలో భాగస్వాముల హక్కులు, పిల్లల హక్కులు, బలహీనుల రక్షణ, వీటికి సంబంధించి శాసనాల వునికి అర్థవంత మవుతుంది.

వివాహ వ్యవస్థ శతాబ్దాల తరబడి పరిణామం చెందింది. మొదటిలో కుటుంబం ఆర్థిక ప్రాతిపదిక కల యూనిట్. కాలక్రమేణా అది అనేక మార్పులు చెందుతున్నది. సభ్యులకు హెచ్చు స్వాతంత్ర్యం లభిస్తుంది. పెత్తందారీ తనం, నశిస్తున్నది. ఈలోగా స్త్రీ పురుషుల మధ్య ప్రేమ కుటుంబ పరిధిలోకి ప్రవేశించింది. ఒకప్పుడు లైంగికతకు సంబంధంలేని ప్రేమను ప్రతిపాదించటం జరిగింది. అది వివాహ వ్యవస్థకు భంగం కలిగించేదిగా వుండేది. కాని దాని ప్రాబల్యం నశించింది. ప్రస్తుతం వివాహ వ్యవస్థలో లైంగికత ఏక పక్షంగానూ, అతి ప్రధాన మైనదిగానూ పరిణమిస్తూ వచ్చింది. దంపతులలో అవతలివ్యక్తి తనకన్నా భిన్నమైనవ్యక్తి అని అంగీకరించడం, ఆ వ్యక్తియెడ శ్రద్ధ వహించడం, వివాహ బంధంలో భద్రతను పొందటం—ఇవి లక్ష్యాలుగా వుండటం లేదు.

చాలామంది వివాహబంధంలో నుండి అసాధ్యమైన వాటిని ఆశిస్తున్నారు. పూర్తి స్నేహాన్ని, సమిష్టి ఆసక్తులను, సమిష్టి కోరికలను అది కలుగజేయాలని కోరుకుంటున్నారు. ప్రేమను ఉదాత్తస్థాయికి చేర్చి, వివాహం శాశ్వత ప్రేమ బంధంగా వుండాలని ఆశిస్తున్నారు. కేవలం నిస్వార్థతను ప్రాతిపదికగా అంగీకరిస్తున్నారు. సంపూర్ణ లైంగిక తృప్తి కలగాలని ఆకాంక్షిస్తున్నారు. ఈ ఆదర్శం సాధ్యం కాదని అనలేము. కాని పలువురి జీవితాల్లో వివాహ వ్యవస్థ నుండి వీలయినంతగా వీటిని పొందగలగడానికి సాధ్యమవుతుంది; అంటే ప్రయత్నించటం వరకే జరుగుతుంది.

ఆధునిక ప్రపంచంలో స్త్రీ పురుషులు యితర పురుషులతోనూ, స్త్రీలతోనూ పరిచయాలు, స్నేహాలు కలిగి వుంటున్నారు. ఒక్కొప్పుడు ఈ సంబంధాలలో శృంగార భావన చోటు చేసుకోవచ్చు. అది లైంగిక సంబంధానికి కూడ దారి తీయవచ్చును. ఆ సంబంధం తాత్కాలికమైనదైనా సుసంపన్న మైనది కావచ్చు. అయితే ఈ సంఘటనలకు వైవాహిక వ్యవస్థకు వున్న సంబంధం ఏమిటనేది చాలా క్లిష్టమైన విషయం. వివాహ బంధంలో దంపతులు ఒకరిపై ఒకరు యాజమాన్యపు హక్కులు కలిగి వుంటారని భావిస్తే ఇలాంటి సంఘటనలు వివాహ విచ్ఛిత్తికి దారితీయ వచ్చును. అలాగే ఆత్మ విశ్వాసం లేనందువల్ల తన వైవాహిక స్థాయికి ప్రమాదం ఏర్పడుతుందని భావిస్తే, ఆ సంబంధం చెడిపోతుంది. అయితే పిల్లల యోగ క్షేమాలను పరిగణలోకి తీసుకొని, వారి యోగ క్షేమాల భద్రతకు ఏర్పాటు చేస్తూ భార్యాభర్తలు విడిపోవడం తప్పనిసరి అయినప్పుడు దానిని నైతిక చర్యగా భావించ వచ్చు. అలాంటి సందర్భాలలో మూడవ వ్యక్తికి సంబంధం లేకుండా అలాంటివారు కలిసి వుండటం అనౌచిత్యం కాదు విచ్ఛిన్న

మైన ప్రేమ బంధంతో దాంపత్య జీవితం గడిపేకంటే విడాకులు మేలు. అయితే విడాకులు కూడ బాధాకరమైన సంఘటనే. అయినా మున్ముందు ఉజ్వల జీవితాన్ని గడపటానికి అవకాశాన్ని విడాకులు కల్పిస్తాయి. అంటే-వీలయితే సరిఅయిన వ్యక్తి తటస్థిస్తే మరో వివాహం చేసుకోటానికి అవకాశం కలుగుతుంది.

జన్మ నిగ్రహ విషయంలో మానవవాదుల మధ్య పెద్దగా అభిప్రాయ భేదం లేదు. జన్మనిగ్రహం అసహజ మనేవారు మానవ జీవితం ఒక రకమైన మానవ సంస్కృతి పరిధిలో సాగుతుందని మరచి పోతున్నారు. జీవిత కాలాన్ని పొడిగించు కోవటం సాధ్యపడుతున్నప్పుడు, తక్కువమంది పిల్లలను కనడం ఆ సంస్కృతి ఆమోదాన్ని పొందినప్పుడు, పిల్లలను శ్రద్ధగా జాగ్రత్తగా పెంచాలను కోవడం సహజం. జన్మ నిగ్రహ సందర్భంగా చివరి నిర్ణయం వ్యక్తుల దయినా ప్రపంచ జనాభా ప్రళయాన్ని పరిగణన లోనికి తీసుకోక తప్పదు. జన్మ నిగ్రహ సాధనాలు అందరికీ అందుబాటులోకి రావాలి. అవి వాడినా విఫలమయితే గర్భస్రావం తప్పనిసరి అవుతుంది. దాంతో ప్రత్యక్ష సంబంధం వున్నవారు మాత్రమే మున్ముందుగా తల్లి, తండ్రి, డాక్టరు నిర్ణయం చేయాలి. ఇది కేవలం వారి అంతరంగాలకు సంబంధించిన విషయం.

చిన్న సమాజాలన్నింటిలో ముఖ్యమైనది వివాహం కనుక దాన్ని గురించి వివరంగా చర్చించడం జరిగింది. వివాహ సంబంధాన్ని గురించి మాట్లాడినంత మాత్రాన ఇతర సంబంధాలకు చోటు లేదని కాదు. శాసనం అంగీకరించని దాంపత్యం, ఏకలింగ సంజాతుల మధ్య సంబంధం అలాంటివి. వివాహితులతో లేక అవివాహితులతో లేక వివాహితులు-అవివాహితులు కలిసివున్న సంస్థ 'కమ్యూన్' అనేపేరుతో వుండవచ్చు. ఈ సమిష్టి వ్యవస్థలో పిల్లల అభివృద్ధికి ఎక్కువ అవకాశాలు వుంటాయి. ముఖ్యంగా అవివాహిత వయోజనులకు, అవివాహిత మాతలకు, సంతాన విహీనులైన తల్లిదండ్రులకు ఒంటరితనం నుండి ఈ సమిష్టి కుటుంబాలు కొంత విముక్తిని కలుగ జేస్తాయి. కాకపోతే ఈ సమిష్టి జీవితంలో తనస్థానాన్ని నెలకొల్పు కోవటానికి అణు కుటుంబంలో కన్నా వ్యక్తికి ఎక్కువ సృజనాత్మక శక్తి కావలసివుంటుంది. లైంగిక తృప్తితో పెనవేసుకున్న సన్నిహిత సన్నివేశమే ఒక రకపు లైంగికతగా ప్రచారం పొందింది. కేవలం లైంగిక తృప్తి జీవితానికి అర్థాన్ని సంతరిస్తుందని మానవవాదులు భావించరు. లైంగికతృప్తికి ప్రాధాన్యతఇచ్చేభావం మానవ లైంగికతయొక్క స్వభావాన్ని మరుగు పరుస్తున్నది. అంతేకాక లైంగిక తృప్తి తక్కువస్థాయి దనే దురభిప్రాయం ఎంతగా

మానవ లైంగికతను అపార్థానికి లోను చేస్తుందో ఈ భావమూ అదే నష్టాన్ని కలుగ జేస్తుంది. లైంగిక ప్రేరణను ఆకలితో పోల్చటం తగదు. ఆకలితీర్చుకుంటే మరొకరికి నష్టంకలుగదు. కాని లైంగికత విషయంలో ఇవతలి వ్యక్తితో సమాన హోదాకల అవతలి వ్యక్తియొక్క హక్కులు, కోరికలు యిమిడి ఉన్నాయి. లైంగికత, వివాహము, సమిష్టి జీవితము మొదలైన రంగాలలో సమానత్వము, స్వయం నిర్ణయము, పరస్పర సంబంధము, వ్యక్తుల స్థానాలు–ఇవన్నీ ప్రాముఖ్యత వహిస్తాయి. వీటిని గురించి స్పష్టంగా నియమాలను నిర్దేశించలేము. మార్పులకు లోను కాని మార్గదర్శకసూత్రాలను కూడ స్పష్టీకరించ లేము.

వివాహ వ్యవస్థ యిటీవల మరో రూపాన్ని సంతరించు కుంటున్నది. దానిపేరే స్వేచ్ఛావివాహం. ఇందులో భాగస్వాములు ఒకరిపై ఒకరు పెత్తనంచేయరు. ఒకరిపై మరొకరికి శాసన రీత్యా హక్కులూ బాధ్యతలూ వుండవు. నిజానికి దీని భాగస్వాములకు ఇతరులతో సంబంధాల విషయంలో కొన్ని చిక్కులు ఉదయించ వచ్చు. అంత మాత్రాన యిష్టపూర్వకంగా ఏర్పరచుకున్న ఈ బంధం నాశన మవుతుందని భయపడ నక్కర లేదు. కొంతమంది స్త్రీలకు భర్త కావాలి, పిల్లలు అక్కర లేదు. మరి కొంత మంది స్త్రీలకు పిల్లలు కావాలి, భర్త అక్కర లేదు. ఇలాంటి అన్ని సన్నివేశాలలోను పరిస్థితులలోనూ వ్యక్తులు మానవులుగా సంచరించటానికి తగిన వీలును, వెసులు బాటును ఒనగూర్చే పరిష్కార మార్గాలను అన్వేషించాలి.

# వివాహ పద్ధతులలో రావలసిన మార్పులు

ప్రేమ లేని పెళ్ళి ఉన్నంత కాలం పెళ్ళి లేని ప్రేమ వుంటూనే వుంటుంది. నిష్కలంక ప్రేమకు అవధులు లేవు. అది అనంతమైనది; శాశ్వతమైనది; స్వార్థరహితమైనది కూడా. అది నైర్మల్యాన్ని ప్రకోపింప జేస్తుంది; త్యాగాన్ని వాంఛిస్తుంది. ప్రియుని శ్రేయస్సును అభిలషిస్తుంది. ప్రతి హృదయంలో ఒక మలయ మారుతంలా, ఒక కాంతి పుంజంలా వికసించేదే శిసలైన ప్రేమ అని నిర్వచిస్తాం. ప్రేయసీప్రియుల పరస్పర సాహచర్యం, అవగాహన, సమ్మతి ప్రేమగా వికసించిన దశలో వారిరువురి సంతోషప్రదమైన కలయికే వివాహం. ఆ వివాహబంధంలో భర్త రక్షకుడు, భార్య రక్షితగా వుండదు ఆకృత్రిమ నిజమైన భాగస్వామ్యం వుంటుంది. అలాకాక కేవలం

లైంగిక నీతికి, వంశోద్ధరణకు, సంప్రదాయ విలువలకు ప్రాతినిధ్యం వహించే వివాహాలు దంపతుల మనస్సుకూ, మమతకూ విలువ కట్టవు. ఆ పెళ్ళిళ్ళకు కులాలు, అంతస్తులు, అధికారాలు, బంధుత్వాలు ప్రాతిపదికలుగా వుంటాయి. ఆ పెళ్ళి వల్ల స్త్రీ తన స్వేచ్ఛను పూర్తిగా కోల్పోతుంది. తన వ్యక్తిత్వాన్ని విస్మరించి కేవలం వంట ఇంటికి, పడకటింటికి పరిమిత మయిపోతుంది. అసలు కుటుంబ వ్యవస్థకు దాంపత్య జీవితం చుక్కాని లాంటిదయితే, దాంపత్య సౌఖ్యానికి పునాది వివాహం. కనుక వివాహం వధూవరులకు మాత్రమే సంబంధించి వుంటుంది. కాని ఆ కుటుంబం సమాజ వ్యవస్థ గతి క్రమానికి మార్గదర్శకమవుతుంది. అందువల్లే సమాజ ప్రగతికి అనుగుణంగా వైవాహిక పద్ధతులను, దాంపత్య వ్యవస్థలను సరిదిద్దుకుంటూ, మార్పులను గౌరవిస్తూ, విలువలను గుర్తిస్తూ మనమే ఆధునిక విధానాలను అన్వేషించాలి.

అసలు వివాహ వ్యవస్థ సమూలంగా మారాలని ఆధునికులు అలజడి చేస్తుంటే, ఏ పరిస్థితిలోనూ మార్పు అసహజమని వివాహబంధం శాశ్వతమని, అది చాలా పవిత్రమైనదని, సనాతన సంప్రదాయ వాదులు ఘోషిస్తున్నారు. కనుక వివాహ విధానాలు ఏనాటివి? అవి ఈనాటికి అనుసరణీయాలా కాదా అసలు వివాహ పద్ధతులు ఎందుకు మారాలి, ఎలాంటి మార్పులు రావాలి, అనే దానికి ముందుగా వివాహ పద్ధతుల పూర్వాపరాలు విచారించటం అవశ్య కర్తవ్యం. అప్పుడే మార్పులు, చేర్పులు, కూర్పులు గురించి చెప్పుకోగలం.

నాగరిక సమాజ ఆవిర్భావం నుండి వివాహ వ్యవస్థ ఏదో ఒక రూపంలో వుంటూనే వుంది. అది మనం కాని మన పూర్వీకులు కాని ఆలోచించి ఒక నిర్దుష్ట రూపం ఏర్పరచి నట్లు దాఖలాలు లేవు. మానవుడు జంతుదశ నుండి విడిబడిన దశలో గుంపులుగా జీవించేవారు. అప్పుడు వయోభేదాలు, రక్తసంబంధాలు గురించిన ఆలోచన వుండేది కాదు. ఉమ్మడి వివాహబంధంతో వుండేవారు. పరిణామ దశలో ఒక్కజంటగా మాత్రమే మన గలిగే స్థితి వచ్చింది. సమాజ గుర్తింపుకు, చట్టపరమైన హక్కులకు వివాహ విధి అవసరమయింది. దేశ కాల పరిస్థితులను బట్టి కొన్ని పద్ధతులు వచ్చాయి. మతాలవారి, కులాలవారి కొన్ని ఆచారాలు పాటించేవారు. క్రైస్తవ వివాహం దేవుని సాక్షిగా మత గురువు ఆధ్వర్యంలో విధిగా చర్చిలోనే జరగాలి. ఇందులో వధువు వరునికి విధేయతగా వుంటానని ప్రమాణం చేయాలి. ముస్లింల వివాహం ఇంత మహర్‌తో ఫలాని ఆయన నిక్కా పెళ్ళాడుతాడు ఇష్టమేనా అని అడుగుతారు. ఈ పెళ్ళి 'కాంట్రాక్టు' మీద జరుగుతుంది ఇది వధూవరుల మధ్య ఒప్పందం

క్రింద లెక్క. 1956లో ప్రత్యేక వివాహ శాసనం వచ్చింది. ఇందులో విభిన్న జాతుల, కులాల, మతాల, దేశాల, భాషల, తెగల వారి మధ్య ఈ వివాహాలు చెల్లుతాయి. వారికి భారత వారసత్వ శాసనం వర్తిస్తుంది.

సనాతన హిందూ వివాహ విధానంలో కన్యాదానం, పాణిగ్రహణం, సప్తపది వుంటాయి. వస్తువును దానం చేసినట్లు కన్యను దానం చేస్తాడు తండ్రి. అప్పటిలో సగోత్ర వివాహాలు, వర్ణాంతర వివాహాలు స్త్రీకి పునర్వివాహం నిషేధింపబడ్డాయి పెళ్ళి తంతును సర్వులకు అర్థమయ్యే తెలుగులో చదివినా, వివాహ తంతు అంటే ప్రమాణం వగైరా స్త్రీ చేయించినా, తాళి లేకుండా దండలు మార్పించినా, మంత్రాలు మార్చి ఉపన్యాసాలు చేసినా వాటిని సంస్కరణ వివాహాలు అంటారు.

ఆదర్శ వివాహంలో కట్నకానుకలకు తావు వుండదు. ముహూర్తబలం వుండదు. వధూవరులు ఒకరినొకరు ఎన్నుకొనుట జరుగుతుంది. దండలు మార్పిడి దానికి గుర్తు. "జీవితాంతం కలిసి వుంటాం" అనే ప్రమాణం వుండదు. ఈ వివాహాన్ని స్త్రీలు కూడా చేయించవచ్చు. ఆ పెళ్ళికి ఆడంబరాలు వుండవు. మూఢ విశ్వాసాల స్వైర విహారం వుండదు. మంత్రాలు, తలంబ్రాలు, తాళిబొట్టు లాంటివి నిషేధం.

ఈ మధ్యలో స్వేచ్ఛా ప్రణయం ఒక వాదంగా వచ్చింది. అది అనతికాలంలో మాసిపోయింది. ఇక విప్లవ వివాహంలో ఏ తంతూ వుండదు. వేదిక, ప్రమాణాలు, పెద్దల సమావేశం వుండదు. ఒకరిపై రెండోవారికి హక్కులూ, బాధ్యతలూ వుండవు. పరస్పర ప్రేమానురాగాలు, సానుభూతి స్పందన వారి కయికకు ఆలంబనాలుగా వుంటాయి. ప్రేయసీ ప్రియులుగా కూడబలుక్కుని కలిసి కాపురం చేస్తారు. ప్రేమ లోపించిన నాడు ఏ రభసా, సామాజిక దౌష్ట్యం లేకుండా కోర్టుకెక్కకుండా విడిపోతారు. ఈ పద్ధతిని వివాహం అనడానికి కొందరు అభ్యంతరం చెప్తారు. ఈ రకపు కాపురం పరిణత మనస్కులకే పరిమితంగా వుంటుంది, అయితే విప్లవ వివాహం ఇంత వరకూ శాసన బద్ధం కాలేదు. తమిళనాడులో దండల మార్పిడిని శాసనం అంగీకరిస్తుంది. అలాగే బహుకాలం కలసి కాపురం చేస్తున్న జంటను భార్యా భర్తలుగా ఎంచవచ్చని సాక్ష్య సంబంధమైన శాసనం (INDIAN EVIDENCE ACT) 114 సెక్షన్ చెప్తుంది. వారి సంతానాన్ని తన సంతానమని పురుషుడు ప్రకటిస్తే, ఆమె పిన తల్లి, చెల్లి కాకుండా వుంటే వారిని వివాహితులుగా అంగీకరిస్తుంది హిందూ ధర్మ శాస్త్రం. ఏదైనా విప్లవ వివాహం స్వేచ్ఛా జీవులకు, తప్పు ఆచరణయోగ్యం కాదు.

మనం ఆ స్థితికి యెదగనంత కాలం ఆదర్శ వివాహం, సంస్కరణల వివాహాలను చేసుకోవటం శ్రేయస్కరం.

వివాహపద్ధతులలో రావాల్సిన కొన్ని ముఖ్యమైన మార్పులను గమనిద్దాం. ప్రేమ వివాహాలకు అనుగుణమైన వాతావరణాన్ని సమాజం కల్పించాలి. యువతకు వివాహ నిర్ణయాలలో పెద్దల ప్రమేయం లేనినాడు వరకట్న సమస్య చచ్చిపోతుంది. కుల మతాల తేడాలు సమసి పోతాయి. స్త్రీ పురుషుల హెచ్చు తగ్గులు అంతరించి పోతాయి. కట్నాలకు, ఆడంబరాలకు వెచ్చించే ధనాన్ని అమ్మాయి విద్యకు వినియోగిస్తే ఆమె కాళ్ళపై ఆమె నిలబడుతుంది. అప్పుడు తగిన భార్యలకై పురుషులే అన్వేషిస్తారు. స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరమనే భావదాస్యం తొలగిపోతుంది. పురుషుడి రక్షణమీద, పోషణమీద ఆధారపడి జీవించే స్థితి స్త్రీకి తొలగిపోతుంది. తనను తాను పోషించుకోగల స్త్రీకి స్వేచ్ఛ, నిర్ణయాలు చేసే స్తోమతు వస్తుంది. ఇంత కాలం స్త్రీ పెళ్ళితో తన స్వేచ్ఛను పూర్తిగా పోగొట్టుకుంటూ భర్త ద్వారా మాత్రమే గుర్తింపు పొందుతోంది. ఇప్పుడా పరిస్థితి మారి తనకు తానే తన సహచరుణ్ణి ఎన్నుకోగల స్తోమతును పొందుతుంది.

అసలు మారాల్సింది వివాహ పద్ధతులు మాత్రమే కాదు. మనస్సులలో, మన విధానాలలో, మన ఆచారవ్యవహారాలలో మార్పురావాలి. వరాన్వేషణ, పెద్దల ప్రమేయం దూరంగా పారిపోవాలి. అమ్మాయిలు స్వతంత్ర బుద్ధినీ, చొరవనూ, ధైర్యసాహసాలను ప్రదర్శించాలి. తమ జీవిత భాగస్వాములను ఎన్నుకునే స్వేచ్ఛకావాలి భావాలలో కలయిక, ఆప్యాయత, అనురాగం లేనివారితో పెళ్ళిజరిగితే అది నరకప్రాయ మవుతుంది. అలా విద్యావతులు సైతం తలవంచి తాళికట్టించుకొనుట అజ్ఞానం, అవివేకం కాదంటారా? మన నడవడిలో, విశ్వాసాలలో జీవిత విధానంలో నూతనత్వం, మార్పు రావాలి. కాక పోతే ఏ సుఖ సంతోషాలకైతే వివాహం చేసుకుంటామో అది పూర్తిగా తొలగిపోతుంది. పురుష దురహంకారం, స్త్రీ హీనస్థితి మలన్ని వెన్నాడుతూనే వుంటాయి. కనుక మహిళల్లో మార్పు ముందుగా రావాలి.

అసలు వివాహ వ్యవస్థే సంధియుగంలో పడింది. స్త్రీ పురుషులిద్దరూ సమాన భాగస్వాములనే భావన ఇద్దరిలో రానంత కాలం అది స్మశాన శాంతిగా భావించవచ్చు. స్త్రీని అణగద్రొక్కే వివాహ వ్యవస్థ రద్దలైనా బాధలేదు. కనుక వివాహ వ్యవస్థలో మార్పు రావాలంటే అందులో బాధితులైన స్త్రీల మనస్థత్వం మారాలి. వారి ఉనికి మారాలి. భర్తలను కొనుక్కునే స్థితి మారాలి. అంతగా అవసరమొస్తే యువతులు కన్యలుగా జీవించటానికి సిద్ధపడితేనే పురుషులలో, సమాజంలో మార్పు వస్తుంది.

# బాధ్యతాయుత వైవాహిక జీవితం

వ్యక్తికి శైశవదశ దాటినప్పటి నుండి కొన్ని బాధ్యతలు వస్తాయి. తల్లిదండ్రులతో, బంధు మిత్రులతో సహోదరులతో బాధ్యతా యుతంగా సంచరిస్తాడు. అలాగే సమాజ శ్రేయస్సు కూడా అతని ముఖ్య కర్తవ్య మయింది. ముఖ్యంగా దేశాభివృద్ధి అతని మొదటి బాధ్యత అయింది. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్ని హక్కులున్నాయో అన్ని బాధ్యతలూ వున్నాయనేది నగ్న సత్యం. అయితే అన్నిటికన్నా అతిముఖ్యమైనది వైవాహిక జీవితంలో మనకున్న బాధ్యత. అది వ్యక్తి జీవితంలో ఉత్కృష్టమైన భాగం. ఆ దశలో మన జీవితం సుఖశాంతులతో జరిగిపోవాలన్నా, దుఃఖభాజనం కావాలన్నా అదిమన చర్యలపై ఆధారపడి వుంటుంది. ఆ కర్తవ్యతా నిర్వహణలో సభ్యతా, సంస్కారాలతో జీవితాన్ని సాగించాలి. అంటే మనకు జీవిత విధానంలో సర్వహక్కులూ వున్నాయి కదా అని విచ్చలవిడిగా పిల్లల్ని కనడం, వనరులు వున్నాయి కాదా అని సంతానాన్ని అదుపుచేయక పోవటం సాంఘిక నేరమని గ్రహించాలి.

అసలు వివాహానికి ముందే యువతీ యువకులకు జనాభా అదుపు గురించి తెలిసి వుంటే తమ జీవితంలో ప్లాను ప్రకారం ఆచరించ గలుగుతారు. స్త్రీ తన ఆరోగ్యాన్ని గురించి ముందు జాగ్రత్త తీసుకుంటుంది. తను కేవలం సంతానాన్ని ఉత్పత్తి చేయటానికే పుట్టలేదని గ్రహించి ఇన ఇష్టప్రకారం ఆచరిస్తుంది. కొన్ని సమయాల్లో తాను గొప్ప సైంటిష్టు కావాలనో, దేశాధినేత కావాలనో, లేక తన ఉజ్వల భవిష్యత్తుకై తాను అసలే బిడ్డను కనునని పట్టు పట్టినా ఆశ్చర్యం వుండదు. భవిష్యత్తుపై మక్కువ గల పురుషులు కూడా తమ కుటుంబ శ్రేయస్సుకు, బిడ్డల సౌఖ్యానికి విలువ ఇస్తారు. అలా వారు ఐచ్ఛికంగా కుటుంబ నియంత్రణను ఆమోదిస్తారు. ఆచరిస్తారు; ప్రచారం చేస్తారు. అందువల్ల వారు పిల్లల కోసమే పెళ్ళాడరు. పెళ్ళి విశాల పరిధి కలది అయితే సంతానం అందులో ఒక అణువు మాత్రమేనని వారు నమ్ముతారు. కొన్ని సందర్భాలలో పిల్లలు వారికి అవాంఛనీయం కూడా కావచ్చు. అంటే దంపతుల లైంగిక జీవిత కాలమంతా కంటూ వుంటే ఈ సువిశాల విశ్వం చాలదు. ఏ సుఖసంతోషాలను ఆశించి పెళ్ళాడుతామో ఆ పెళ్ళి దుఃఖ భాజన మవుతుంది. పుత్రుడు పున్నామ నరకం నుండి తప్పిస్తాడు అనే భావంతో కొడుకు పుట్టేదాకా కనడం బాధ్యతా రహితమని గ్రహించాలి. ఒక రిద్దరితో సరిపెట్టుకుంటే వారేమయి పోతారోననే బెంగ వల్ల

కొందరు, సంతానం దేవుని వరప్రసాదమని మరికొందరూ, సంపదవున్నదికదా ఎంత మందినైనా పోషించగల మనే ధీమాతో కొందరూ, వృద్ధాప్యంలో ఏ ఒక్కడో అండగా నిలుస్తాడు కనుక పదిమందిని కనాలనే వారు కొందరూ, సంతానమే సంపదగా భావిస్తూ కొందరూ కంటూ వుంటారు. ఈ మనస్థత్వం నిజంగా సాంఘికాభివృద్ధికి గొడ్డలిపెట్టు. మనది ప్రజాస్వామిక రాజ్యం. ఇందులో స్వచ్ఛందంగా ఆచరించాలేకాని ప్రభుత్వ నిర్బంధంలేదు. అందువల్ల తమ ఇష్టం వచ్చినంత మందిని కనవచ్చుననే స్వార్ధంతో సంచరించేవారు వున్నంత కాలం మనకు, మనదేశానికి ప్రగతి శూన్య మవుతుంది.

కనుక ప్రతిపౌరుడికి వైవాహిక జీవితంలో కొన్ని హద్దులూ, బాధ్యతలూ వున్నాయని విస్మరించడం నేరమవుతుంది. అంతేకాదు అది సాంఘిక ద్రోహం అన్నా తప్పు లేదు. అందువల్ల వైవాహిక జీవితం చాలా ఉత్కృష్టమైనది; విలువైనది కూడాను. ఆ కర్పృత్వ నిర్వహణలో దంపతులిద్దరూ బాధ్యతాయుతంగా సంచరించాలి. కుటుంబ వ్యవస్థలో దంపతులు, పిల్లలు ముఖ్యపాత్ర ధారులు. కనుక కన్నబిడ్డల్ని ఉత్తమ పౌరుల్ని చేయాల్సిన బాధ్యత తల్లిదండ్రులది. తలకు మించిన సంతానాన్ని కంటే, వారిని ఆరోగ్యవంతులుగా, నీతిమంతులుగా, విద్యావంతులుగా చేయటం తమ శక్తికి మించిన పని. వారు అజ్ఞానులుగా, చీడపురుగులుగా తయారైతే ఆ దోషం తల్లిదండ్రులది. కనుక ఒకరిద్దర్ని కని వారిని సుశిక్షితులుగా తయారు చేస్తే ప్రశాంతత, తృప్తి వుంటాయి. అందువల్ల వివాహ జీవితాన్ని సుఖవంతంగా మలుచుకోవాలంటే భార్యాభర్త లిద్దరూ బాధ్యత వహించాలి. తమ కర్తవ్యతా నిర్వహణలో ఏమరుపాటు పనికిరాదు. జీవితంలో అన్నిటి కంటే ముఖ్యమైనవి కుటుంబ వ్యవస్థా, పిల్లలూ. అలాంటి దాంపత్య జీవితానికి రధసారధులు దంపతులు. వారు దాన్ని గురించి ముందుగా ఒక పధకాన్ని వేసుకోవాలి. చర్చించు కోవాలి. నిర్ణయించు కోవాలి. ఏ ఒక్కరిద్దర్నో కని వారిని సక్రమంగా పెంచి తమ జీవితాన్ని తృప్తిగా, ప్రశాంతంగా మలచుకోవాల్సిన బాధ్యత వుంది. అలా ఆ విషయంలో బాధ్యత వహిస్తారని ఆశించడం పొరపాటు కాదు.

# ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే !

వివాహం అనేది దంపతుల జీవిత సమరంలో చివరి అంశం కాదు. జీవన యాత్రకు నాంది ఈ పెళ్ళితోనే ప్రారంభమవుతుంది. కనుక ఈ అలల తాకిడిని తట్టుకోగల ధైర్యం వారికి చాలా అవసరం. అసలు వివాహ విధానం ఎలా పుట్టింది? ఎలా

పెరిగింది? ఏంచేస్తుంది? అది ఎందుకు అవసరమయింది అనేవి కొన్ని ప్రశ్నలయితే వివాహ వ్యవస్థలో మార్పు రావాలని, ఆధునిక వివాహాలు, సంస్కరణ వివాహాలు, విప్లవ వివాహాలు అందులో చోటు చేసుకోవాలని కొందరు వాదిస్తున్నారు. అసలు 'ఫ్రీ లవ్' అంటే స్వేచ్ఛా ప్రణయానికే విలువ ఇవ్వాలని మరో వర్గం ఆందోళన చేస్తున్నారు. అయినా ప్రేమ వివాహాల వల్లే కుటుంబ వ్యవస్థ పటిష్టంగా మనగల్గుతుందనే వారూ లేకపోలేదు. ఇంకా బాల్య వివాహాలు, ఏర్పాటు పెళ్ళిళ్ళు (అరేంజిడ్ మ్యారేజస్) వల్లనే వివాహబంధం బద్దలు కాదనే వారే మిక్కుటంగా వున్నారనేది నగ్న సత్యం. పెద్దలు చేసే పెళ్ళి ఎలా సాధ్యం! అని పాశ్చాత్యులు విస్తుపోతున్నారు. నేను ఈ మధ్య యూరప్ వెళ్ళినప్పుడు ఏర్పాటు పెళ్ళిళ్ళపై వారు ప్రశ్నల వర్షం కురిపించారు. వారు 'లౌ మ్యారేజస్'కే ప్రాధాన్యతనిస్తున్నారు.

ప్రేమ వివాహం అనగానే కొంతమందికి చులకన భావం. మరి కొందరికి నిరాదరణ భావం. ఇంకా కొందరికి సంపూర్ణంగా వ్యతిరేక భావం ఉదయిస్తున్నాయి. కొద్దిమంది మాత్రం దాన్ని ఆమోదిస్తున్నారు. దీని విషయమై మంచి చెడ్డలను తర్కించి, వితర్కించి ఒక నిర్ణయానికి రావాలంటే సమగ్రమైన అవగాహన కావాలి. పదాల అర్థాలు, వాటివెనుక దాగివున్న మౌలిక భావాలు, ఆ వ్యవస్థ యొక్క పుట్టు పూర్వోత్తరాలు పరిశీలించాలి. ఏ సమస్యనైనా సామాజికంగా పరిశీలించాలి. ఒక వ్యవస్థయొక్క పుట్టుక, మనుగడ, పరిణామం ఎలాంటి సామాజిక ఫలితాలకు దారి తీస్తుందనేది ముఖ్య ప్రశ్న. కనుక ఎంత సేపూ సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని ఏ సమస్యనైనా ఆలోచించాలి. కేవలం సమాజాన్ని మాత్రమే తీసుకొని వైఖరి నిర్ణయించడం కూడా మంచిది కాదు. వ్యక్తుల కలయిక వల్లనే సమాజం ఏర్పడుతుంది. వక్తులు వినా సమాజం లేదు సమాజం నిజానికి వక్తులు నిర్మించుకుందే. లేక పరిణామంలో వ్యక్తుల కోసం పుట్టి పెరిగింది అని చెప్పుకోవచ్చు. కనుక ప్రేమవివాహం అనే సమస్యను వ్యక్తిపరంగానే మదింపు వెయ్యాలి మరో ముఖ్యమైన విషయం పదాల వెనుకవున్న అర్థాన్ని బట్టి అవి తెలియ బరిచే భావాన్ని బట్టి నిర్ణయం జరగాలి. ఇది ఒక రకంగా తాత్విక దృష్టికి సంబంధించిన విషయం. ప్రేమ వివాహం అనే పదజాలంలో ప్రేమ, వివాహం అనే పదాలు వున్నాయి వీటిని ముందుగా విడమరిచి చెప్పుకోవాలి. ఆ తర్వాతే ప్రేమ వివాహాల గురించి చర్చిద్దాం.

ప్రేమ అంటే ఇరువురు వక్తుల మధ్య సంబంధాన్ని తెలిపేది. ఈ సంబంధం ఎంత బలీయంగా వుంటే సమాజం అంత పటిష్టంగా వుంటుంది. ప్రేమతో అవతలి

వ్యక్తి మీద సానుభూతి వుంటుంది. అలాగే అభిమానమూ వుంటుంది. అందువల్ల ఒక వ్యక్తి మరో వ్యక్తి కోసం త్యాగం చెయ్యటం కూడా సంభవిస్తుంది. ఈ ప్రేమ తత్వాన్ని గుర్తించడం అవసరం వాస్తవానికి సమాజాన్ని కట్టిపడేసేది ప్రేమ. నిజమైన ప్రేమకు చలనం లేదు. ప్రేమ వున్న చోట విశ్వాసం కూడా వుంటుంది. ప్రేమ మోహం కంటే వున్నతమైనది; శృంగారం కంటే విలువైనది.

శృంగారాన్ని కొలవవచ్చు కాని ప్రేమకు హద్దులు, అవధులు లేవు. దాన్ని నిర్వచించటానికి ఏ కొలమానమూ లేదు. ఇద్దరు వ్యక్తులను సన్నిహితం చేసేది ప్రేమ. పరస్పర గౌరవం, అభిమానం, సహనం, సర్దుకుపోవడం ఒకరికొకరు త్యాగం చెయ్యటం, ఒకరి సంతృప్తి కొరకు ప్రయత్నించడం ప్రేమ లక్షణాలు. ప్రేమ అంటే సంతోషంతో జీవించడం, భాగస్వామ్యం కలిగి వుండటం. ప్రతి వైవాహిక నౌకకు ప్రేమ ఒక ధృవ నక్షత్రం లాంటిది. ఈ దృష్టితో చూస్తే ప్రేమ లేని వివాహం, వివాహం లేని ప్రేమ చిక్కులకు దారి తీస్తాయి. స్త్రీ పురుష సాహచర్యం, పరస్పర అవగాహన, సమ్మతి ప్రేమగా మారిన దశలో వారిరువురి సంతోషప్రదమైన కలయికే ప్రేమ వివాహమని చెప్పుకోవచ్చు.

ఈ సందర్భంలో వివాహం అనే మాటకు కూడా అర్థం తెలుసుకోవాలి. పెళ్ళి అనేది ఒక సామాజిక కట్టుబాటు. ఒక స్త్రీ ఒక పురుషుడు కలిసి ఒక ఇంట్లో కాపురం చెయ్యటానికి చేసుకున్న నిర్ణయం. అలాకాక స్త్రీ పురుషులు ఒకర్నొకరు అభిమానించుకొని అప్పుడప్పుడూ కలిసి వుంటే అది వివాహం అనిపించుకోదు. కనుక పదిమంది ఆమోదించిన పద్ధతిలో ఒక స్త్రీ ఒక పురుషుడు కలిసి కాపురం చేస్తేనే దాన్ని పెళ్ళి అంటారు చుట్టూ వున్న జనం ఇరుగూ పొరుగూ అందరూ మెచ్చితేనే అది వివాహం. అలాంటి సంబంధం సక్రమమయినదని, అలాకాకపోతే అది కేవలం అక్రమ సంబంధమైనదని అంటారు.

అలా కాక ఒక స్త్రీ ఒక పురుషుడు చిత్త శుద్ధితో పరస్పరానురాగంతో కలిసి కాపురం చేస్తుంటే సమాజం అంగీకరించినా లేక పోయినా అది పెళ్ళి క్రిందే లెక్క. ఈ సంబంధంలో అనురాగం ముఖ్యం. కాని సమాజపు ఆమోదం ముఖ్యం కాదు. ప్రేమలేని పెళ్ళి నిష్ఫలం; నిష్ప్రయోజనం అది మోడువారిన చెట్టుతో సమానం. అసలే ప్రేమ లేని కాపురం శాసన సమ్మతమైన వ్యభిచారం అని పెద్దలు పేరు పెట్టారు. ఇరుగూ పొరుగూ గుర్తించని సంబంధంలో కట్టుబాటు లోపిస్తుందని, అది అక్రమ సంబంధమని కూడా కొందరంటారు. అది ప్రేమ వ్యవహారం (Love Affair) కావచ్చు కాని ప్రేమ

వివాహం మాత్రం కాదు. కనుక ప్రేమ, పెళ్ళి రెండూ అవసరమే. ఇందులో ఏది లోపించినా ప్రమాదమే.

ప్రేమ వివాహాలు తరుచుగా దెబ్బతింటున్నాయని వాదిస్తున్నారు కొందరు. ఇందులో కొంత సత్యం వుంది. ఈ పెళ్ళిళ్ళు సంప్రదాయానికి, కులమతాలకు వ్యతిరేకంగా జరుగుతాయి. ఇందులో వధూవరుల తల్లిదండ్రులు, బంధువులు కోపంతో వారికి ఏ విధమైన సాయమూ చెయ్యరు. కష్టం వచ్చినా ఆదుకోరు. ఆర్థికంగా నిలబడరు. అందు వల్ల ఆ దంపతులు ఇబ్బందుల పాలవుతారు. అంతేకాని ప్రేమ విచ్ఛిత్తి వల్ల కానే కాదు.

భార్యా భర్తల మధ్య ప్రేమాభిమానాలు నిండుగా వున్నప్పుడు చుట్టూ వున్న సమాజాన్ని పట్టించుకోనక్కర్లేదు. వివాహ సంబంధాన్ని పెంచి పోషించేది ఆలు మగల అనురాగమే. వారి జీవితాలను సమైకం చేయగల శక్తి ప్రేమకు వుంది. అది ఇటుకను మరో ఇటుకతో కలిపే సిమెంటు లాంటిది. ఒకరి మీద మరొకరికి మక్కువ వున్నప్పుడు వారిద్దరూ అవతలి వారి కోసం ఎంతటి త్యాగానికైనా నడుం కడతారు. త్యాగం సహనానికి దారి తీస్తుంది. కనుక ప్రేమ విఫలం కావడం అనేది కల్ల. ప్రేమ వివాహం చేసుకునేవారికి చిత్త స్థయిర్యం, పట్టుదల, ధైర్యం, శక్తి వుంటే ఎన్ని అడ్డంకులనైనా అధిగమించగలరు. అందువల్లే నిజమైన ప్రేమకు బాహ్య ప్రకటన అనవసరం. అది క్రియా రూపంలో మిళితమై వుంటుంది. అప్పుడు విభిన్న వ్యక్తులైన వారి వ్యక్తిత్వాలను చిదిపి వేయకుండా వారి ప్రేమ వారి వ్యక్తిత్వాలను పెంచుతుంది.

పెళ్ళయిన నెలకే తిరిగి వొచ్చేసిందొక పి.హెచ్.డి పూర్తి చేసిన యువతి. "అంత తొందరెందుకు పడ్డావమ్మా" అని ప్రశ్నించా. ఆయనొక "ఐ.ఏ.ఎస్. ఆఫీసరండీ! పెళ్ళి చూపుల్లో నచ్చాడు. అతని అలవాట్లూ, అభిప్రాయాలూ నచ్చలేదు. నాకు స్వతంత్రాలోచనలున్నాయి. తెగతెంపులు చేసుకున్నానండీ". అలాగే మరో కేసు వచ్చింది. భార్యాభర్తలిద్దరూ డాక్టర్లట. ఆమె వృత్తి రీత్యా ఎందరినో కలవడం, ఆలస్యంగా రావడం జరిగేది. అనుమానంతో భర్త పడే పాట్లు చూడలేక ఆమె విడాకులు పుచ్చుకున్నానని చెప్పింది. స్పష్టమైన అభిరుచులున్న వారు, ఇమడలేక ఇబ్బంది పడి పోతున్నారు. మా చిన్నప్పుడు బాల్య వివాహాలు వుండేవి కనుక అమ్మాయిలకు ఏ ఆదర్శాలు, లక్ష్యాలు, సిద్ధాంతాలు వుండేవి కావు. భర్తల భావాలే తమవిగా గౌరవించేవారు. స్వామిగా ఆరాధించే వారు; సేవలు చేసే వారు. మితి మీరిన కష్టాలుంటే కుమిలి

కృశించి పొయ్యే వారు. ఈనాడు అలా కాదు. ఇమడలేక పోతున్నారు. కారణం—సంఘర్షణ వ్యక్తుల మధ్య జరగదు. వారి భావాల మధ్య, అభిరుచుల మధ్య జరుగుతుంది. పెళ్ళికి ముందుగా చర్చించు కోకపోవట వల్లా, కలిసిమెలిసి తిరగక పోవటం వల్లా, అభిరుచులను గురించి అర్థం చేసుకోక పోవటం వల్లా విడిపడి పోయే కేసుల సంఖ్య పెరిగి పోతోంది. అంతేకాని ప్రేమ వివాహాల వల్ల కాదు.

"లౌ ఎట్ ఫస్టు సైట్" అనే మాట అర్థరహితం. మనస్సులోని ఆకర్షణే ప్రేమ అని భావించడం పెద్ద పొరపాటు. తాత్కాలిక ఆకర్షణ ప్రేమ క్రిందికి రాదు. మోహానికి ప్రేమకూ తేడా వుంది. ఒక వ్యక్తి యొక్క నడకను చూచి, సంభాషణను విని, హాస్య ధోరణిని తిలకించి, శారీరక సౌందర్యాన్ని గమనించి మరో వ్యక్తి ఆకర్షణకు లోను అవుతాడు. అది ప్రేమ కాదని తెలియక పోవడం వల్ల దెబ్బ తింటున్నారు.

పరస్పర సమ్మతి, అవగాహన, ప్రేమ వివాహాలకు ప్రాతిపదికలు. ఆ వివాహాల్లో కొన్ని ప్రత్యేక లక్షణాలు వుంటాయి. అందులో ఆలు మగల సంబంధం విలక్షణమైనది; ప్రత్యేకమైనది. ఒకరు రెండోవారికి విధేయులుగా వుండరు; రెండోవారి శ్రేయస్సు కోరతారు. కాని ఒకరు మరొకర్ని వాడుకోరు. ఇద్దరిలో తేడాలు, హెచ్చు తగ్గులూ వుండవు. పని విభజన వుండదు. ఇద్దరి సౌకర్యం ఆనందం ఇమిడి వుంటాయి. ప్రేమ అంటే పాతివ్రత్యం అనే భావం పోతుంది. పురుషుడు కూడా ప్రేమ భావన ప్రదర్శిస్తాడు. స్వామిగా కాక సహచరుడుగా సంచరిస్తాడు. రక్షకుడు, రక్షిత కానప్పుడే వారిరువురి మధ్య నిజమైన అభిమానం, భాగస్వామ్యం వుంటాయి.

ప్రేమ వివాహాల వల్ల లాభాలు చాలా వున్నాయి. కట్నం ఇచ్చే పద్ధతి నశిస్తుంది. కులమత తేడాలు తొలగిపోతాయి. ముఖ్యంగా స్త్రీకి దూరమై పోతున్న స్వేచ్ఛ దగ్గరవుతుంది. సమాజంలో సమతుల్య స్థితి నసించకుండా వుంటుంది. ఇందులో ఇద్దరూ స్వతంత్రించి తమకు నచ్చిన వారిని స్వీకరిస్తారు. కులం, గోత్రం, ఆస్తి, అంతస్తూ పరిగణనలోకి రావు. కష్టాలు కలిగినా ఓర్మితో భరిస్తారు. కుటుంబంలో సామరస్యం పెరుగుతుంది.

ప్రేమ వివాహాలు ఎలా సాధించాలి? అంటే విద్యాలయాల్లో సహవిద్యను పెంచే ఏర్పాట్లు చెయ్యాలి. వివాహాలకు ముందు ఒకరి అభిరుచులు రెండోవారు పూర్తిగా తెలుసుకోవాలి. ముందుగానే దాంపత్య విధానం, కుటుంబ వ్యవస్థా, బాధ్యతల గురించి ఆలోచించు కోవాలి. ఈ వివాహాలు జరిపించటానికి, ఆ దంపతులను అవసరమొస్తే

ఆదుకోవటానికి మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలూ బాధ్యత వహించాలి. వారికి నైతికంగా, అండదండలు అందించాలి సాంఘికంగా వచ్చే కష్టాలకు, వ్యతిరేకతకు తగిన సలహాలు ఇవ్వాలి. అవసరమొస్తే ఆదుకోవాలి. అలా ప్రేమ వివాహాలపై విశ్వాస మున్నవారు ఆ దంపతులను ఆదుకుంటే వారికి చిత్త స్థైర్యం కలుగుతుంది. ప్రేమ వివాహాల సంఖ్య పెరిగి ఆ దంపతులు, సుఖసంతోషాలకు చేరువ అవుతారు. సఫలత చేకూరు తుంది.

వివాహ వ్యవస్థ ఇటీవల మరో రూపాన్ని సంతరించు కుంటున్నది. దాని పేరే స్వేచ్ఛా వివాహం. ఇందులో భాగస్వాములు ఒకరిపై ఒకరు పెత్తనం చేయరు. ఒకరిపై మరొకరికి శాసన రీత్యా హక్కులూ బాధ్యతలూ వుండవు. నిజానికి దీని భాగస్వాము లకు ఇతరులతో సంబంధాల విషయంలో కొన్ని చిక్కులు ఉదయించ వచ్చు. అంత మాత్రాన ఇష్టపూర్వకంగా ఏర్పరచుకున్న ఈ బంధం నాశన మవుతుందని భయపడ నక్కరలేదు. కొంతమంది స్త్రీలకు భర్త కావాలి; పిల్లలు అక్కరలేదు. మరికొంత మంది స్త్రీలకు పిల్లలు కావాలి భర్త అక్కరలేదు. ఇలాంటి అన్ని సన్నివేశాలలోను పరిస్థితుల లోనూ వ్యక్తులు మానవులుగా సంచరించటానికి తగిన వీలును, వెసులు బాటును ఒనగూర్చే పరిష్కార మార్గాలను అన్వేషించాలి.